1957లో విజయనగరంలో జరిగిన అష్టమరాఘవ నాటకోత్సవాల నాటక పోటీలలో ప్రజానాట్యమండలి విజయనగరం వారిచే ప్రదర్శింపబడి తృతీయబహుమతిగా రాఘవాషీల్డును బడసిన నాటకం.

## పాత్రలు:-

గౌరీపతి,
అప్పన్న,
రాం,
సోం,
శఠగోపం,
శిశిర్ కుమార్,
సేట్ చిరంజీలాల్ ఝుంఝుంవాలా,
శోభ.

# అభ్యర్థన

ఈ నాటకంలో అనవసరంగా సంగీతం చొప్పించకుండా ప్రదర్శిస్తే సంతోషిస్తాను. ఈ నాటకాన్ని 'నా అనుమతి లేకుండా ప్రదర్శించరాదు.

రచయిత.

# మొదటి రంగము

[ఒక అప్టుడేట్ మేడ క్రిందవసారా. ఒకటీపాయ్, ఒక డబుల్ సోఫా, ఇటూ అటూ రెండు సింగిల్ సోఫాలు ఉంటాయి. డబుల్ సోఫా వెనుక నుండి మేడమెట్లు, బాల్కనీ ఉంటుంది. స్టేజిలో ఒకమూలకు ఒక టెలిఫోనూ దానివద్ద ఒకకుర్చీ వుంటాయి. రెండోమూలకు ఒక రేడియో దాని మీద ఒక ఫ్లవర్ వేస్ ఉంటాయి. మేడమెట్లప్రక్కన ఒక నగ్నసౌందర్య విగ్రహం. బాల్కనీప్రక్కగా ఒకగది. గోడలకు ప్రకృతిదృశ్యపట ములు, దుప్పికొమ్ములు ఉంటాయి.

[తెర లేచేసరికి నౌకరు అప్పన్న సామాన్లు సర్దుతూ పేపరు అదే పనిగా చూస్తూంటాడు.]

గౌరీపతి:- (మెట్లుదిగివచ్చి) ఓరే! అప్పన్నా! ఏమిటిలా చూస్తున్నావు. కొత్తవార్తలేమన్నా ఉన్నాయా ?

అప్పన్న:- చిత్తం ఇది చదవండిసార్ "రామాపురంలోని అనాధశరణాలయానికి గౌరీపతిగారి భూరివిరాళం ! 10 వేల రూపాయలు."

గౌ:- ఓస్! ఇంతేనా! ఏం ఆవార్త నిజమూ అబద్ధమూ అని అనుమానిస్తున్నావా ?

అ:- లేదు బాబూ! పేపర్లలో అబద్ధాలు వ్రాస్తారా! కాని తమ ధర్మబుద్ధికి పొంగిపోతున్నాను.

గౌ:- ఓస్! ఈమాత్రానికేనా! ఇదిగో ఇది చదువు మరీ పొంగిపోతావు. (జేబులోనుండిఒకకవరుతీసి యిస్తాడు.]

అ:- [కవరు విప్పటానికి అనుమానిస్తాడు.]

గాః- ఏం చదవడానికి అనుమానమెందుకు, చదువు. అది కూడా రేపటిపేపర్లో పడేవార్తే!

అః- [విప్పి చదువుతాడు] "మాన్యశ్రీ గౌరీపతిగార్కి మీరు విశ్వదాతను మరపించారు. మీ దాననిరతికి మా సంస్థతరపున మీకు మా కృతజ్ఞతాభివందనములు. మీ విరాళంతో మా సంస్థకు కట్టించే భవనం ప్రవేశమహోత్సవము మీరే జరిపించాలి, తేదీ త్వరలో తెలియపర్చుకుంటాము.

ఇట్లు విధేయులు,
జయంతి కామేశ్వరరావు
కార్యదర్శి.
అనాథ వివాహసంఘం; సాలూరు.

అః - భవనానికి ఎం తిచ్చేరేమిటి?

గాః- ఆ! ఎంతలే! 50 వేలు.

అః- 50 వేలే! బాబూ బాగానేఉంది కానీ...

గాః- ఊ కానీ......నీ సందేహమేమిటో నాకు తెలుసును నే నిలా వేలకువేలు దానం చెయ్యడం నీకు బాధగా వుంది కాదూ!

అః- బాధకాదుబాబూ! ఉన్నప్పుడిలా డబ్బుపంచిపెడితే..

గాః- తర్వాత మన కెలాగా అని కాదూ...

అః- చిత్తం బాబూ!

గాః- ఉన్నవా డియ్యకపోతే లేనివా డేమిస్తాడు. డబ్బు మనకు కలిగింది, పదిమందికి పెట్టి మనంకూడా తిం

దాము. రూపాయికి రూపాయి పెంచి, కడుపు కట్టు
కొని పస్తులుపడి యినప్పెట్టెను నింపి, అహర్నిశలు
నిద్రాహారాలు మాని. ఆ ఇనప్పెట్టెను కాచుకొని,
చివరకి మూరెడు గావంచాతో కళ్ళు మూసేవాడికి
వచ్చేదేమిటి?

అః- తృప్తి ఉంటుందిగా బాబూ!

గా:- తృప్తేమిటి? ఉన్నదంతా ఖర్చుపెట్టి కీర్తి, గౌరవం
సంపాదించి హాయిగా హంసలా కళ్ళు మూయ్యడమేరా
నా సిద్ధాంతం.

అః- బాబూ రోజు లిలాగే వుండవు.

గా:- వుండవు. వుండవని నాకు తెలుసు. మారాయి, మారు
తున్నాయి.

అః- తెలుసుండీ ముందు కింత దాచుకుంటేనేగాని! ఎలాంటి
చిక్కు లొస్తాయో!

గా:- రోజులు మారుతాయని భయపడి చేతికి చిక్కిన ప్రతీ
దమ్మిడీ, ప్రతీ కానీ చిక్కపెట్టి, అరచే కాకికేనా
అన్నంమెతుకు విసరక కుక్కబ్రతుకు వెళ్ళబుచ్చిన
లోభిని ఒక్కమారేనా తలుస్తుందా యీ సంఘం,
వాడు చచ్చాడో బ్రతికాడో కావాలా ఈసంఘానికి.
పదికానులు మనవి కాదనుకుంటే పదిపంక్తులు మనని
గురించి పేపర్లలో...దానితో పదిమంది ఆస్థాన
కవీశ్వరులు...ఒకటిరెండు గ్రంథాలు మన కంకితం...
అధమం మునిసిపల్ కౌన్సిలర్ గిరీ...నాలుగైదుసభల

కధ్యతులూ... రెండు మూడు శంఖు స్థాపనలూ... ఓ అడిగావా! అత డొక పెద్దమనిషి. వాడు చస్తే సంతాపసభలు, సానుభూతి పద్య రత్నాలు, వాడి శిలా విగ్రహాలు,ఇంకా దేముడు మేలుచేస్తే ఒక మంగలిషాపుకో ఒక కాఫీహోటలుకో వాడి నామ ధేయం...ఇదంతా సంఘసేవ!

అ:- అంత చులకనగా సంఘం అంగీకరిస్తుందా!

గౌ:- ఈ సంఘానికి అసలువిలువలతో పనిలేదు.

అ:- కాదు బాబూ. ధర్మాత్ముణ్ణి ధర్మాత్ము డంటుంది. దుర్మార్గుణ్ణి దుర్మార్గు డంటుంది.

గౌ:- నీకు తెలీదు అప్పన్నా. ధర్మం చేయడంలోనేవుంది.

అ:- పొరపాటు. అధర్మాన్ని ఆచరిస్తూ చేసే ధర్మాన్ని సంఘం ఆమోదించదు.

గౌ:- [నవ్వి] అంటే ధర్మానికి వినియోగించేడబ్బు, అధర్మం వలన వచ్చిందైతే ఈ సంఘం ఆ డబ్బుతో చేసే ధర్మాన్ని గుర్తించదంటావు! అంతేనా!

అ:- చిత్తం!

గౌ:- బ్లాకు మార్కెట్టులో జనం నెత్తురు పిండి, లాభాలు గడించి, నోరు వాయీ లేని రాతి విగ్రహాలకు బంగారు కిరీటాలను చేయించిన పరమభాగవతోత్త ములు లేరా! పారిశ్రామికుల నెత్తురు పీల్చి, మంట పాలు కట్టించి,తల పగిలేలాగ కొబ్బరికాయలు కొట్టే భక్తశిఖామణులులేరా! నైవేద్యం పెట్టే సరుకుల్ని

సంచుల కెక్కించి బజార్లో పెట్టి డబ్బుచేసి తప్పుడు లెక్కలు చూపించే ధర్మకర్తలు లేరా! వీళ్ళంతా సంఘంలో మొదటిరకం పెద్దమనుషులు. సిసలైన జాతీయవాదులు. సంఘానికి వెన్నెముకలు.

అ:- చెడు ఎక్కడపడితే అక్కడే ఉంది. మంచివాళ్ళు లేరంటూరా!

గొ:- మంచివాళ్ళు ఈమహానామహానుభావుల చాటున క్రుంగిపోతున్నారు. నీలాటి సత్యకాలపువాళ్ళింకా ఉన్నారంటే నా కాశ్చర్యంగా వుంది.

అ:- బాబూ! వాళ్ళకు కాలం దానంతట అదే మూడుతుంది. వాళ్ళు బట్టబయలౌతారు.

గొ:- అప్పన్నా...[కోపం, విసుగు] ఇలాటివి పెద్దపెద్ద విషయాలు. నేను ధర్మం, దానం చేస్తున్నాను. నా పేరు మ్రోగిపోతోంది నీ కానందంకాదూ!

అ:- ఎందుకుకాదుబాబూ! కళ్ళుగల భాగ్యం. తమ నౌకర్నంటే నన్నే ఎంతో గౌరవిస్తున్నారు. నే నొచ్చానంటే తమరే వచ్చారేమో అని జనం విరగపడతారు. చివరకు ఆశాభంగం పొంది నన్ను వెయ్యి ప్రశ్నలువేసి తమగురించి ఏమేమో అడుగుతారు. [మిగతా మరికొన్నిపత్రికలు చూస్తూంటాడు.]

గొ:- ఏమిటీ! ఏమేమిప్రశ్నలు అడుగుతారూ.

అ:- ఒకటా! లక్షప్రశ్నలు.

గొ:- ఏమని!

అ.- "దానకర్ణ" గౌరీపతిగారి ఆరోగ్యంబాగుందా అని.

గొ.- ఆ!

అ:- అంతలోనే వారిలోనే మరొక డంటాడు "ఛా! వారికి వెయ్యేళ్లు ఆయుర్దాయంరా!" అని.

గొ:- ఇంకా?

అ:- వారు జమీందారులా? అంటా డొకాయన.

గొ:- నీ వేమంటావు?

అ:- ఏదీ, నన్నే మేనా అననిస్తేనా? వారిలోనే మరొక డంటాడూ "ఆయన మహారాజురా" అని.

గొ:- ఇంకా !

అ:- ఓకకవిగా రంటారూ "ఆయన అవతరించిన బలిచక్రవర్తి, కళాకోవిదుడు. నాగ్రంధం ఆయనకి అంకిత మిస్తాను" అని.

గొ:- ఛా! పాడుకవి వాడికి ఉపమానమే తెలీదు. బలిచక్రవర్తి దాతఅయినా రాక్షసుడు. వాడు మనయింటికొస్తే గెంటివేయి.

అ:- చిత్తం. ఒకటా రెండా బాబూ - ఈ పత్రిక ఎక్కడుంటే తమ రక్కడే ప్రత్యక్షం.

గొ:- ఓ! అదా "ఖాకా"పత్రిక.

అ:- [అన్నిపత్రికలూ తెరచి చూస్తూంటాడు.]

గొ:- ఏమి టా పత్రికలన్నీ అలా పరీక్షగా చూస్తున్నావు.

అ:- ఏమీలేదు. ఈ పత్రికలోవున్న ఈ పెద్దక్షరాల వార్తలేవీ దీంట్లో లేవేమా అని.

గౌ:- ఓ! అదా నీఅనుమానం. ఒక్కొక్కపత్రిక ఒక్కొక్కరకమైన వార్తల్ని ప్రకటిస్తుంది. ఒక్కొక్క పత్రికకు ఒక్కొక్కహీరో ఉంటాడు. ఆ పత్రికలో వాడు తుమ్మినా దగ్గినా, గాస్తంత కళ్ళు ఎఱ్ఱబడినా బాకాన్ని కట్టివేస్తారు.

అ:- ఈ బాకాపత్రిక మనస్వంతమా బాబూ.

గౌ:- స్వంతంలాంటిదే. ఆ పత్రికా సంపాదకుడు నా శ్రేయోభిలాషి. బాల్యమిత్రుడు.

అ:- బాబూ ఈ పత్రికలన్నింటినీ తమగుప్పెట్లో పెట్టుకుంటే.

గౌ:- బాగుంటుంది. కాని ఈ పత్రికల్ని పోషించడంఅంటే పీడల్ని పిశాచాల్ని పోషించడం లాంటిది. మనిషిని రక్తమాంసాలతో పీల్చేస్తాయి. అదీగాక ఆ పత్రికల ధోరణి నాకు నచ్చదు. అందుకే బాకాను మనదిగా పోషిస్తున్నాను.

అ:- ఈ పత్రి కెవరిది బాబూ

గౌ:- ఈ పత్రికా...[ద్వారంవేపు చూసి] ఓ వెయ్యేళ్ళు ఆయుష్షు... ఎడిటర్ బాకా, మిష్టర్ శతకోపం! కమ్ ఇన్...ఆయనే సంపాదకమహాశయుడు.

శతకోపం:- నమస్కారం గౌరీపతిగారూ [అంటూ ప్రవేశిస్తాడు.]

గౌ:- కొంచెందూరంవెళ్ళి శతకోపాన్ని తీసుకొచ్చి కూర్చోబెడుతూ, అప్పన్నా కాఫీ తీసుకురా; కూర్చో శత

కోపం. [ఇద్దరూ కూర్చుంటారు. అప్పన్న కాఫీపెట్టి అక్కడే ఉంటాడు.]

గొ:- అప్పన్నా బజారుకు వెళ్ళి కావల్సిన కూరలు పట్రా - కలరువంకాయలతో జిహ్వా చచ్చిపోయింది. తాజా అయిన కారెట్, బీట్రూట్, క్యాబేజీ వగైరా సరి కొత్తకూరలు పట్రా.

[పదిరూపాయలనోటుతీసి అటూ ఇటూ చూసి అది జేబులో పెడుతూంటాడు]

అ:- ఇవ్వండిబాబూ. పదిరూపాయలు ఇవ్వాళ ఖర్చుఅయి పోతాయి.

గొ:- ఈ నోటు చెల్లుతుందో చెల్లదో... ఇదిగో నోటు పట్టుకెళ్లు [మరొకనోటు ఇవ్వబోతూంటే]

అ:- అదేమిటి బాబూ అలా అనుమానిస్తున్నారు. రెండు నెలలనుంచీ ఉంటున్నాను. ఇంక నన్ను నమ్మ లేదూ! ఆనోటే ఇప్పించండి. ఇట్టే మార్చేస్తాను.

శత:- నమ్మినబంటు వీడిని అనుమానిస్తే ఎలాగ - ఇయ్యి వాణ్ణి.

అ:- ఇవ్వండి బాబూ.

గొ:- వెరీగుడ్! అదీనేర్పు. ఇదిగో. మార్చేయి. దారిలో జాగ్రత్త. [పదిరూపాయలు ఇస్తాడు.]

అ- ఓ! ఎంతోజాగ్రత్తగా ఉంటున్నాను. [అంటూ వెళ్ళి పోతాడు.]

గాః- [అప్పన్న ఇంగ్లాక చదివిన ఉత్తరం ఇస్తూ] ఇదిగో ఉత్తరం. ఈ ఈత్తరాన్ని యథాతథంగా అచ్చు వేయి. పెరుగుతూన్న మనకీర్తి దీంతో మరొకమె ట్టెక్కుతుంది.

శత:- మెట్టెక్కడమేమిటి, ఏ కీర్తి సౌధం పూర్తయింది. కలకలలాడుతూ శోభలను వెదజల్లుతూంది. [సంచిలో నుండి పత్రికని తీసి యిస్తూ] ఇదిగో మొన్న నువ్వు వ్రాసియిచ్చిన గేయం ఈరోజున ప్రతి పత్రికలో అచ్చు వేశాను.

గాః- ఏదీ [పత్రిక తీసుకొని]

విరబూచి, విరబూచి
అరమొద్దు కన్నులతో
ఆరగించినదోయి
ఆలకించినదోయి
విరికన్నె నా గీతి
కరగిపోయినదోయి

రచన:-శశిర్ కూర్.

ఆహా! ఈ వ్యాసంగంలో హృదయం స్పందించి వ్రాయడానికే సమయం చిక్కకుండావుంది. శోభ కిచ్చి వస్తాను (అంటూ గబగబా పైకి వెళ్ళి పేపరు శోభ కిచ్చి వస్తాడు)

శత:- ఇవాళకి ప్రోగ్రాము ఏమిటి?

గాః- చాలాఉంది. రమారమి రెండువేలవరకూ పదులు దిగాయి.

శర:- అయితే నావాంతో 5 వందలు వేసుకుంటాను. మూడువందలు పేపరు కొనాలి. వందవరకూ ఇంక్ కొనాలి. మిగతాది రాత్రి పేకాట క్లబ్బులో మార్చేస్తాను.

గౌ:- భేష్! చేతినిండా డబ్బు వచ్చిందన్నమాటే! క్లబ్బు! రాత్రికి నేనుకూడా 5 వందలు పట్టుకువస్తాను పగ నికి మారిపోతుంది.

శర:- అఖండప్రతిభావంతుడివి. నువ్వు తల్చుకుంటే రాయి బంగారమౌతుంది.

గౌ:- మార్చిన కరెన్సీ ఈ 5 వందలూ నీ దగ్గరుంచు అవసరానికి ముందు పనికివస్తుంది

శర:- ఒకటడుగుతాను చెప్పు. ఈ దానాలు ధర్మాలు ఎందుకు పబ్లిష్ చెయ్యడం. మనకిమట్టుకి మన కావల్సిన డబ్బు వుంది. ఈ తెచ్చిపెట్టుకున్న కీర్తి నీకెందుకూ.

గౌ:- ఈసంగతే నిన్నడగవద్దని చెప్పాను. నే నెలా చెప్తే అలా నడుచుకో చందాలివ్వ నక్కరలేదు. పత్రికను ఊళ్ళో వాళ్ళందరికీ పోస్టుఖర్చుకూడా ఇవ్వనక్కర లేకుండా పంపించు. మనపట్ల ప్రజల కెలాటి అనుమానమూ ఉండడానికి అవకాశ ముండకూడదు.

శ:- గౌరీపతీ నా మనస్సును ఎంత బాధపడ్డా వంచించుకో లేకుండా ఉన్నాను.

గౌ:- ఏం వంచించుకో లేవ్రూ! తిండికి గతిలేక కాఫీహోటలులో సర్వరు పనిచేస్తూ కొక్కిరాయి గీతలు గీసి పత్రి

కలకు పంపి వాళ్ళేదో యిస్తారని ఆశించి, పోస్టుమేన్ కోసం ఎదురుచూసి చివరకు నీ రచనే నీకు భద్రంగా తిరిగి వస్తే మనియార్డరనుకొని ఆదుర్దాపడి చివరకి తిరిగి పంపిన బుక్ పోస్టును చూచి ఆశాభంగంపొంది పరితపించినరోజులు మరచిపోయావా? జ్ఞాపకం చేసుకో-రచయితగా పేరు కనిపిస్తే చాలుననే రోజులకూ, శాఖా సంపాదకునిగా పేరు చూచుకునే ఈరోజులకు వ్యక్తమౌతున్న నీ పరిమాణాన్ని జ్ఞాపకంచేసుకో.

శ:- జ్ఞాపకంఉంది. కాని ఈ ఆత్మవంచనను భరించలేకుండా ఉన్నాను.

గా:- నీకొక్కడికేనా ఆత్మవంచన. నాకు లేదూ? నన్ను మహారాజంటే ఔనంటున్నాను. రాజాధిరాజనిపించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాను. దానకర్ణుడంటే ఔనంటున్నాను. అభినవ శిబిచక్రవర్తి అనిపించుకోవాలని ఉబలాటపడుతున్నాను. గతిలేక ఉద్యోగం లేక పస్తులుపడి, తల్లీ తండ్రీ చెల్లెలూ తమ్ముడూ ఆకలికి చావగా చూచి ఇంకా నేను మనిషినే అని వ్యక్తిత్వాన్ని కల్పించుకున్న నేను నన్ను వంచించుకోవటంలేదూ? కాని ఇది తప్పదు. మనం ఒకదారి త్రొక్కాము. ఆ దారిలో చాలాదూరం నడిచాము. ఇక మనం అడుగు త్రిప్పలేము.

శ:- అన్నీ అనిపించుకుంటున్నావు కాని, నీదైన నీ కవితా హృదయాన్ని నీవు నీది కాదంటున్నావు.

గా:- అవును. అది అవసరం.

శ:- ఈమధ్య ఒక అవాంతరం వచ్చింది.

గా:- నీకా? నాకా?

శత:- మనిద్దరికీనీ ... "శిశిర్ కుమార్" ఎవరని స్పెషల్ బ్రాంచి పోలీసులు నన్నడిగారు.

గా:- ఎందుకు.

శత:- ఆ గేయాలు నామపక్ష సిద్ధాంతాల్ని చాటుతున్నాయని, ప్రభుత్వాన్ని అభిశంసిస్తున్నాయనీ.

గా:- పోలీసులకి ఇంతకన్న ముంచిపనిమరి దొరక లేదల్లేఉంది! ఏమన్నావు?

శత:- అతడిదీ మద్రాసు జార్జి టౌన్ అని చెప్పాను. అంతటితో పోయారు.

గా:- థ్యాంక్స్! చూచావా! ఆపేరు వేరవడంవల్ల ఉన్న లాభం. వాటికే నా పేరుఉంటే తీగతోపాటు డొంకంతా కదుల్ను.

(అప్పన్న వట్టిసంచితో తిరిగివస్తాడు.)

శత:- అడుగో అప్పన్న వచ్చాడు.

గా:- అరే వట్టి సంచీతో తిరిగివచ్చేశాడే-వం బజారులో కూరలులేవా! - నోటు మారిందికాదా?

అ:- నోటు మారకపోవడమేమిటి సార్! ఈ అప్పన్న అంత చేతకానివా డనుకున్నారా?

గా:- [నోటు అందుకొని] సెభాష్! నోటు నోటుగానే మార్చాశావే.

శత;- ఉద్దండపిండం. మనకంటే రెండాకు లెక్కువే చది వాడు.

అ:- అదేమిటిసార్, అలా అంటారు

గా:- మరి కూరలో

అ:- కూరలకు చిల్లరపట్టుకెళ్దామని వచ్చాశాను ఒక చిల్లర రూపాయు ఇవ్వండి కూరలు తెచ్చేస్తాను.

గా:- ఎలా మార్చావ్.

అ:- ఏముంది ఒకాయన ఒకకట్ట నోట్లు లెక్కపెట్టుకుంటు న్నాడు. ఒక పగిలిపోయిన నోటును అటూ ఇటూ తడివి చూచుకుంటున్నాడు. దగ్గరగా వెళ్ళి బాబూ నోటు బాగా నలిగిపోయిందే అన్నాను.

గా:- అంటే.

అ.- ఈ ఒక్కనోటూ ఎలా వచ్చిందోఅంటూ విసుక్కుం టున్నాడు.

శ:- విసుక్కుంటూంటే.

అ:- కొత్త నోటివ్వనా బాబు అన్నాను. అంతే. కొత్తనోటు తీసుకొని పాత నోటిచ్చేశాడు.

గా:- తస్సాదియ్యా! నౌకరువే కాకుండా నీవు నటుడిలా ఉన్నావు.

శ:- అమాయకుడు చెడిపోయాడు.

గా:- ఎందుకు చెడిపోతాడు! వాడింకో చెమటోడ్చి పని చేసే కూలీల కిచ్చేస్తాడు.

శ:- ఆ నోటుతో మొదట మహా సంబరంగా చిల్లర మార్చే షావుకారు దగ్గర కెళ్తారు.

అ.- తీరా అతను ఆనోటు మారదని చెప్పేసరికి వారు నిలువునా నీరై పోతారు.

గా:- వెంటనే ఇచ్చినవాడిదగ్గరకు పరిగెడతారు.

శ:- వాడు నాకేం తెలీదు పొమ్మంటాడు.

అ:- ఆ కుటుంబాలు ఆ మరుచటి సాయంత్రంవరకు పస్తుల పాలౌతారు.

గా:- చాలు, ఆపండి. మీ అతివాగుడు. లోకంలోఅంతా ఎలాచస్తే మనకేం కావాలి? మనం చస్తే లోకంలో ఏ ఒక్కడైనా బాధపడతాడా?

శ:- అందుకని లోకాన్నంతనీ మనం శత్రువులుగా చేసుకొని బాధపడతామా?

గా:- బాధపడినవాడూ, బాధపడవలసిన మనిషీ బాధపడక మానడు. వాడి అవస్థను బ్రహ్మైనా తప్పించలేడు.

అ:- తెలిసికూడా తప్పు చేస్తామా?

గా:- అంతా తెలిసే తప్పు చేస్తున్నారు. తప్పుచేసి క్షమించమంటున్నారు. చేసిన పాపాలన్నీ చేసి దేవాలయంలో ఒక కొబ్బరికాయ కొట్టి జే గంట మ్రోతతో పాపాలను క్షమించమంటున్నారు. పాపాలు చేశామనే ఆలయాలకి పోతున్నారు. పాపాలుచేయకపోతే ఈ ఆలయాలే అక్కరలేదు. లంచంపుచ్చుకునే ఆఫీసరు అది లంచమనీ, తను పుచ్చుకొనకూడదనీ తెలిసే పుచ్చు

కుంటున్నాడు. అతని విచక్షణాజ్ఞానాన్ని అవసరం ద్రిగమింగి అతనిలోని మానవతని చంపేస్తున్నది. హత్య చేసినవాడు హత్య చేస్తున్నానని తెలిసే చంపుతాడు. నేరం చెయ్యలేదంటాడు. ఇదంతా తప్పించుకుందామని ప్రయత్నిస్తాడు. ఎస్కాపిసన్ మన మానవులలో మొదటిలక్షణం. దీనికి మూలం అవసరం. దీనికి విచారపడటం- అనవసరం.

అ:- బాబూ మీరు విచిత్రంగా మారిపోతున్నారు.

గౌ:- అప్పన్నా! నువ్వు ఇదిగో ఈ రూపాయిపట్టుకొని బజారుకు వెళ్ళి కూరలు పట్టుకురా_పో.

అ:- చిత్తం బాబూ [అని వెళ్ళిపోతాడు]

శ:- గౌరీపతీ! వాడుండగా నువ్వేంమకలా బయట పడతావు ప్రమాదం కాదూ.

గౌ:- వాడు మనంలో వాడే ఏం చెయ్యను శశకోపం! ఒక్కొక్కప్పుడు నాహృదయం పగిలిపోతుంది.

శ:- అదుగో శోభ వస్తున్నట్లుంది ఇక నేను వెళ్తాను, ఏవీ ఆ నోట్లు.

గౌ:- [బాగ్‌లో నోట్లుసర్దుతూ] శశకోపం రేపటి పత్రికలో ఈ గేయాన్నికూడా అచ్చువెయ్యి చూడు ఇంకా కటికవరు ఫోపలివార్త, ఉండే హెడ్‌లైన్స్‌లో పడాలి. మారకం చేసేటప్పుడు జాగ్రత్త [పంపిస్తాడు]

శ:- ఇన్నాళ్ళయాక నువ్వు నాకు చెప్పాలా! సెలవ్, గుడ్ ఈవినింగ్ [పోతాడు]

గౌ:- [శోభ పాడుతూన్న పాటని అందుకొని] కమ్ ఆన్ శోభా కమ్ ఆన్ [అని చెయ్యి అందించి దింపుతాడు]

శో:- [వయ్యారంగా దిగి పాడుతూ సోఫాలో కూలపడుతుంది]

గౌ:- ఏం శోభా! గేయంలో తన్మయురాలవై పోయినట్లున్నావ్!

శో:- యస్ గౌరీపతీ! ఆ గేయాలలో మైమరచిపోతున్నాను. ఎంత మధురంగా వుంటున్నాయి. వెరీస్వీట్

గౌ:- కావ్యంలోని మాధుర్యాన్ని ఆనందించడానికి నీలో ఇంకా సహృదయత మిగిలి ఉందా!

శో:- గౌరీ! [కోపం] నీలాగా నేను అన్నీ విసర్జించ లేను.

గౌ:- [అనునయంగా] కోపంలో నీముఖం ఎంతో అందంగా వుంటుంది. ఆ ఆనందం అనుభవిద్దామని అలా అన్నాను. నీకు గేయాలంటే ఎంత అభిమానమో నాకు తెలీదూ!

శో:- ఆకవి ఎంత అదృష్టవంతుడో

గౌ:- ఏ కవి

శో:- అతనే - ఆ గేయాలు వ్రాసినకవి. శిశిర్ కుమార్.

గౌ:- దరిద్రుడు—పరమ దరిద్రుడు.

శో:- కాదు, ఆత్మీయుడు-బాధోపహతులైన జీవులకు శాంతి దాత- తల్లడిల్లిన హృదయాలను తరింపజేసే అదృష్ట దీపుడు.

గౌ:- అత నొక దొంగ. దొంగతనంగా జీవించేవాడు. సంఘానికీ తోడి మానవులకీ తనని చూపలేని పిరికిపంద.

శో:- కాదు! గౌరీపతీ! అట్లా-అతన్ని నిందించకు. నేనుసహించ లేను.

గౌ:- ఏం అతనినినువ్వు చూచావా.

శో:- లేదు.

గౌ:- మరి అతన్ని నిందిస్తే నీ కెందుకు బాధ.

శో:- అతని కవితా హృదయానికి నేను అంకితమయాను. అతను నా కారాధ్యదైవం. అతని కవితకు నేను మంత్రముగ్ధ భుజంగాన్ని.

గౌ:- పొరపడుతున్నావు శోభా! అతన్ని నువ్వు చూస్తే ఇలా అనవు.

శో:- అతన్ని నేను చూస్తే—తరిస్తాను. ఆమహాకవికి నా యావత్తు శరీరాన్ని ధారపోస్తాను. ఆ జయదేవునికి నేను ప్రత్యక్షపద్మావతిగా నృత్యాంజలి సమర్పిస్తాను.

గౌ:- ఆహా! శోభా!! నేనే ఆ శశిర్ కుమార్ ని. నేనే ఆ గేయాలు వ్రాశాను. రా! నా పద్మావతీ! నృత్యం చెయ్యి! ప్రియే చారుశీలే తవ చరణం మమ శరణం ...[అని వంగుతాడు]

శో:- ఛీ నాన్ సెన్స్. [లెంపకాయ కొడుతుంది] దూరంగా వుండు. నాదగ్గరకూడా మోసమేనా! దగాకోర్— నీవే ఆ కవివైతే ఇలాగే సత్కరిస్తాను.

గౌ:- అవును. నీవు నమ్మవు. నేను నిన్ను నమ్మించలే
నన్ను నేనే నమ్మలేని పరిస్థితికొచ్చాను. ఇది నీ త
కాదు. నాతప్పు. కొట్టావు శోభా! విస్మరిస్తున్న
గతాన్ని నాకు జ్ఞాపకం చేశావు. ఆవేశంలో నన
నేనే మరచిపోతున్న నాకు జ్ఞాపకంచేశావ్.
మానవతను నేను గుర్తించుకో కూడదని నాకు గు
పాఠం నేర్పేవు. థాంక్స్.

శో:- గౌరీ! ఆవూసెత్తకు కచ్చితంగా చెప్తున్నాను. మన
ఎలాగుంటున్నామో అలాగే ఉందాము

గౌ:- కాని ఈనాటి పరిస్థితి ఏనాడేనా రాకమానద
అప్పుడు నువ్వూనాకు క్షమార్పణ చెయ్యక మానవ

శో:- అ దెన్నటికీ జరగదు. గౌరీపతీ ఆవేశంలో మర
పోతున్నావు

గౌ:- లేదు, శోభా! గతాన్ని మరచేటంత జ్ఞానహీనుణ్
మాత్రంకాదు. నే నున్నస్థలం నాకు తెలుసు

శో:- ఏమిటి ?

గౌ:- ఇది నీమహాలు. నేను నీ ఇంట్లో వ్యాపారం చేస
న్నాను-అంటే జమీందారిణి శోభాదేవిగారింట్లో

శో:- [నవ్వి] నువ్వేమవుతావు ఆ జమీందారిణికి??

గౌ:- ఏ మవుతాను?ఎరగనివారొస్తే జమీందారు గౌరీపతిగ
నటిస్తాను. ఎరిగినవారొస్తే శక్రటరీ గౌరీపతి నౌతాను.
నైటుక్లబ్బులో ఆమె డాన్సర్ రమ అవుతుంది, నేన

క్లబ్ మాస్టరునౌతాను. నాచేతిలో రాజుంటే, ఆమె రాణినిస్తుంది. నా చేతిలో రెండాసులుంటే ఆమె మూడో ఆసు నిస్తుంది. ఆడేవాళ్ళంతా చిత్తై బికారులౌతారు. సొమ్మంతా అప్పటికిమాదే. ఇంటికి వచ్చాక సొమ్మంతా ఆమెది. నా మిమనే నాది. నా చెల్లని నోట్లే నావి. ఏం? ఎలాగుంది! మనకథ!

ఎక్సలెంట్. చాలా బాగుంది. నీకు కొంత కవిత్వం వుంది. అలవాటు చేసుకుంటే నువ్వో శశిర్ కుమార్ లాగా వ్రాస్తావేమో!

అలాగే వ్రాసేవాడిని. కాని అతను నా దగ్గరనుండి విడిపోయాడు. ఒక జమీందారిణి ప్రేమించింది. ఒక నైట్‌క్లబ్ రాణి అతన్ని అజ్ఞాతంగా ప్రేమించింది. అతను పాపం ఆవిడదగ్గరకు రాలేడు ఆమె అతని దగ్గరకు పోలేదు. నేనో! ఒక నైట్‌క్లబ్ రాణికి దాసుణ్ణయాను. ఆమె నన్ను ప్రయోగించుకుంటూంది. అవసరం తీరిపోగానే నన్ను నిరాకరిస్తుంది. ప్రపంచానికి నా స్వరూపం చూపలేక చీకట్లో బంధించుకున్నాను.

విచారపడుతున్నావా! గౌరీపతీ! నీ కేంలోటు! రోజూ నోట్లకట్టలు తయారు చేస్తావు అవన్నీ మార్చేస్తాం. కావల్సినంత జల్సా. ఇంకా ఏం కావాలి?

నిజంగాఅడుగుతున్నావా! నాకు డబ్బుక్కర లేదు.

అయితే ఎందు కీ తాపత్రయం?

గా:- నీ హృదయం కోసం. నీ కోసం.

శో:- నీ కేం పిచ్చెక్కిందా! ఒక దొంగ, ఒక నేరస్థుడు ఒక దగాకోర్ని ప్రేమించే స్త్రీవుంటుందా?

గా:- అతనిలో సహృదయతా మానవత్వమూ లేవా?

శో:- లోకం చూడలేదు. ప్రయత్నించినా గోచరించవు. నేను నీడబ్బునే కోరేను. నీ కాశ్రయం లేనప్పు డాశ్రయం యిచ్చాను. జ్ఞాపకముందా. ఆనాడు పోలీసులు వెంటతరుముతూ ఉంటే భయంతో నువ్వు మాపోర్టికోలో దాంకున్నావు. అక్కడ నాటామీ నీచొక్కాపట్టుకుని అరవడం మొదలుపెట్టింది. అప్పుడే నేను క్లబ్బునుండి వచ్చాను. నిన్ను నా వెంబడి తీసుకుపోయి పోలీసులనుండి రక్షించాను. నీలో కొంత ప్రజ్ఞ, ఉపజ్ఞ కనిపెట్టాను. ఈ యంత్రాన్ని నీ కప్పగించాను. నీకు కావలసినంత డబ్బిస్తున్నాను. యథేచ్ఛగా కీర్తిని సంపాదిస్తున్నావు. పదిమంది మిత్రులను పోషిస్తున్నావు. ఇంతేనా మనకూ మనకూ జరిగిందీ,

గా:- అవును, అంతే కాని, ఆకథ అంతటితో ఆగలేదు. నీ విలాసయువసంఘంలో నన్ను దించావు. భోగలాలసులైన కోటీశ్వరులతో. నేను జమీందార్నని పరిచయం చేశావు, త్రాగించేవు, పేకాట ఆడించేవు, నీ నాట్యానికి నన్ను తాళం వెయ్యమన్నావు. పైపెక్కన ఆకోటీశ్వరులమధ్య నన్ను కూర్చోబెట్టి పేకముక్కలు

దొంగతనంగా అందించి మన కరెన్సీకిబదులు వాళ్ళ నోట్లన్నీ కాజేయించావు. అర్ధరాత్రి షికార్లు త్రిప్పావు. అవసరమున్నంతసేపూ నీవు భార్యగా, నేను భర్తగా నటించాము. వర్ధమానమైన నాహృదయం కన్ను విప్పింది. నిన్నూ, నీహృదయాన్నీ కావాలంటున్నది. దీనికి బాధ్యత నీదా? నాదా?

శో:- పొరపడ్డావు. నీవూ నటించేవు - నేనూ నటించాను నటనవరకే. అంతే!

గా:- నేను ఇక నటించలేను, నటించే అవసరం లేదు. శోభా మనదగ్గరడబ్బంతా పట్టుకొని హాయిగా ఏ జాంబారో వెళ్ళిపోదాము. ఇక్కడికీ వ్యాపారం మానేద్దాము.

శో:- నేను ప్రేమించడమే ఉంటే నా శిశిర్ కుమార్ తోనే. ఇక ఆ పూసెత్తకు. కళకు కవిత్వానికి నేను అంకిత మయ్యాను.

గా:- కళ! కవిత్వం! కళను నమ్ముకున్న ఏ కళారాధకుడు కళారాధకుడుగా జీవించగలిగాడు? ఏకళాభ్యాసకుణ్ని కడుపులో పెట్టుకుని పోషించి కళాప్రపుల్లతకి దోహదమిచ్చిందీ ప్రజానీకం! కళారాధకులు పొట్ట కూటికి జోళ్ళుకుట్టేపనో, రెడీమేడ్ దుస్తులమ్మే పనో, సున్నపుబస్తాలు లెక్క పెట్టేపనో చేసి జీవిస్తున్నారీనాడు. ఏ కళారాధకుడు కళద్వారా తన జీవితాన్ని వెళ్ళబుచ్చగలిగాడు? కవిత్వం. ఏ కవి

దరిద్రుణ్ణి ఆదరించిందీ సంఘం! ఎంత కష్టమైనా భజన పరులను చుట్టూ చేరదీసి, వారిచే స్తోత్రపాఠాలు చేయించుకుంటుందేగాని ఒక్క సన్మానపత్రమైనా ఇచ్చిందీ లోకం? కవిగా బ్రతికినవాడికెవడికైనా రెండుపూటలా తిండి ఉందా? కవిగా జీవించే అర్హతను కల్పించిందా ఈ సంఘం? ఈ సంఘం అంతా చేయనిపనిని నీవు చేస్తావా? ముందే ఈ మాటెందుకు చెప్పలేదూ?

శ్రీ:- అది నీ కనవసరం. ఇంతింత భావాలు కలవాడివి ఎందుకు దిగబడ్డా వీ వృత్తిలోకి?

గో:- పరిస్థితుల ప్రాబల్యంవల్ల! నేనూ కవిత్వం చెప్పాను. ఒక్కపత్రికైనా అచ్చువేసినపాపాన పోలేదు. ఉద్యోగంకోసం ఊరూరా గాలించాను. ఎక్కడా దొరక లేదు. అడుక్కు తినడానికైనా పిడికెడు మెతుకులు దొరకలేదు. ఆకలికల్లాడి తల్లి, పుట్టెడురోగంతో తండ్రిశల్యావశిష్టులై కుళ్ళి కృశించి మరణించారు. పిడికెడు మెతుకులుకోసం గిలగిల తన్నుకొని, ఆకలి బాధ భరించలేక చెల్లీ తమ్ముడు మరణించారు. సంఘం చేతకానివాడంది. అందరికీ దూర మయ్యాను. గతిలేక ఒక రొట్టెముక్కకోసం దొంగ నయ్యాను. పోలీసులు వెంట తరిమారు. నీవు రక్షించావు. కవినీ అని మరి చెప్పుకోను. ఆ వ్యక్తికి దూరమయ్యాను.

శ్రీ:- గతాన్నిప్పుడు ఆహ్వానిస్తావా?

గా.- వద్దు, శోభా వద్దు. గతాన్ని తరచేటంతటి రాతిగుండె కాదు నాది.

(తెరలో గుసగుసలు వినిపిస్తాయి)

శో:- ఎవరో వచ్చినట్లుంది.

గా:- ఎవరది [తెరలో "మేము రాము, సోము"] కమ్ఇన్.

శో:- నేను వెళ్తాను. మీరు మాట్లాడుకోండి.

రాము:- (ప్రవేశించి ఒకేసారి) గురువుగారూ! కొంప

సోము:- మునిగింది.

గా:- ఏమయింది దొరికిపోయారా?

సోము:-ఈ పత్రిక చూడండి.

రాము:-ఏమిటిరా ఆ గాభరా! [పత్రికతీసుకొని చదువుతూ] అంటే ప్రభుత్వం ఆచోకీ పట్టిం దన్నమాట.

(అప్పన్న కూరలతో ప్రవేశిస్తాడు)

అ:- ఏమిటి బాబూ అది.

గా:- ఏంలేదు. ఒకా మెకు రెండుతలలు, నాలుగు కాళ్ళు, నాలుగు చేతులూ గల ఒక పిల్లాడు పుట్టాడట. ప్రభుత్వశాస్త్రజ్ఞులు ఆ సృష్టి రహస్యాన్ని ఆచోకీ కట్టారట. ఈ పేపరులో పడితే చదువుతున్నాను.

అ:- అలా కంగారుపడుతున్నారు. సోమూ రామూ మీ రెండు కలా వణకిపోతున్నారు.

సో:- కొంప మునిగింది.

రా:- మునగడమేమిటి? కొంప అంటుకున్నాయి.

గా:- కోతివెధవలు, గోరంతలు కొండంతలు చేస్తారు.

అః— (గౌరీపతి చేతిలోనుంచి పేపరు చదివి) ఓస్ ఇంతే
నా వూరంతా అప్పుడే అనుకుంటున్నారు.
గౌః— నీకు చదువొచ్చా? అప్పన్నా రాదన్నావుగా!
అః— చదువులొస్తే ఈపాటికిమంత్రి నవనా బాబూ! అదిలేకే
తమలాంటివారి కానికూడు తినడం.
సోః: మరి పత్రికలో చూచావెందుకూ?
రాః— అలా కాదురా! మరి పత్రికలో చదివావెందుకు?
గౌః— వాడికి చదువురాదంటే గాడిదలు.
అః— తమరన్న ప్లే అందులో ఉందో లేదో అని చూచాను.
గౌః— అది కాదు ఊళ్ళో చెప్పుకుంటున్నా రన్నావు ఏమి
టదీ?
అః— అదేవో పుకారు. లెక్కలేటి బాబూ!
సోః— లోకులు కాకులు.
రాః— నీటి కాకులు.
గౌః— మాలకాకులు. మీ తలకాయ, ఏమిటది అప్పన్నా?
అః— అదేనండి పేపర్లో పడిందనే అనుకుంటున్నారు.
గౌః— ఇంతేనా! అయితే పేపరుందిగా చదువుకుంటాలే!
నువ్వువెళ్ళు లోపల అమ్మగారు నువ్వువస్తే అర్జం
టుగా పంపమంది. త్వరగా వెళ్ళు.
అః— చిత్తం! [పోతాడు]
గౌః— [పేపరువిప్పి] 'రామాపురంలో దొంగనోట్లతయారీ—
ప్రఖ్యాత అపరాధ పరిశోధకుడు సుధాకర్ నిరూ
పకం' వీడిమొహాం వీడుపుమొహాం వీడూనూ ఛీ!!

'రామాపురంలో వేలకొలది దొంగనోట్లు తయారు కాబడి ప్రభుత్వ ధనానికి విపరీతంగా నష్టం వస్తూంది. వీడిబొంద నష్టమేముందీ! ప్రభుత్వపనీ నోట్లు అచ్చు వేయడమేగా! ఆపనే మనమూ చేస్తున్నాము. ఇందు లో నష్టమేముందో? అయినా ప్రభుత్వానికి మరేంపని లేనట్లుంది.

[మూసేస్తూంటాడు]

సో:- చివరవరకు చదవండి దేవదేవా!

రా:- ఆ, శాంతం అవధరించండి మహానుభావా!

గౌ:- ఏం! ఇంకేముంది '15 రోజులలో ఈముఠాని పట్టి స్తామని డిటెక్టివ్ సుధాకర్ ప్రభుత్వానికి వాగ్దాన మిచ్చి ఈరోజే రామాపురానికి బయలుదేరిన సంద ర్భంలో పోలీసుమిత్రులు వారి జయంకోరుతూ వీడ్కో లిచ్చారు' వీడ్కోలే వీడికి శాశ్వతంగా ఈ ప్రపంచం నుండే వీడ్కోలవుతుంది ఒరే సోం!

సో:- చిత్తంగురూ!

గౌ:- ఒరే రాం!

రా:- సత్యంగురూ!

గౌ:- ఇక మీరు నోట్లుమార్చడమేగాకుండా మీరుకూడా డిటెక్టివ్‌లుగా పనిచెయ్యాలి.

సో, రా:- ఏంచేయాలి?

గౌ:- మీరు పోలీసుస్టేషనూ,

సో:- అమ్మో పోలీసుస్టేషనే! మళ్ళీ అత్తవారింటికి వెళ్ళ మంటావా గురూ!

గా:- అబ్బా చెప్పేదివినండి. పోలీసుస్టేషనూ, ట్రావిలర్సు బంగళా,

రా:- అదిగో ఆ బంగళావేపువెళితేనే కిందటి కొళదా జోడుపుచ్చుకొని కొట్టాడు. పల్లెటూళ్ళంటే చెప్ప గురూ హలాల్.

గా:- వినండిరా! ఆ సుధాకర్ ఎవడో ఎలాంటివాడో, ఎప్ప డెప్పు డేమంచేస్తుంటాడో తెలుసుకుంటూండాలి. ఎప్పటికప్పుడు నాకు తెలియపర్చాలి.

సో:- అయితే నేను అర్జంటుగా సైకిలుమీద వెళతాను.

రా:- ఆహా! నేను పరుగెత్తి వెళ్ళి నీ సైకలుకన్నాముందు వచ్చేస్తాను. [ఇద్దరూ ఒకరికన్నముందు ఒకళ్ళు వెళ్ళ బోతూంటారు]

గా:- ఆగండిరా! ఏమి టా కీచులాట. మీరిద్దరూ విడిపో యి సాధ్యమైనంతవరకూ వేషాలుమార్చుకొని తిరుగు తూఉండాలి.

సో:- వేషాలు మార్చుకునా?

రా:- మరేమిటి ఉదరనిమిత్తం బహుకృతవేషం.

సో:- నహింనహింరక్షతి డుక్రుఙ్కరణే

రా, సో:-భజగోవిందం భజగోవిందం [అని పాడుతుంటారు

గా:- నోర్లుమూయ్యండి.

రా, సో:- [నోర్లు మూసుకుంటారు]

గా:- సోం.

సో:- [నోరుమూసుకునే] గురూ!

గా:- నీ వేం వేషం వేసుకుంటావు.

సో:- గుణసుందరిలో శివరావు వేస్తాను.

రా:- ఛీ నీముఖం! ఎలుగుబంటిలా లేదే!

సో:- భల్లూకరాజు వేషం కాదురా! బ్రహ్మ దేవుడా వేషం [బ్రహ్మ దేవుడా పాట లంకించుకుంటాడు]

గా:- షటప్. నీవు సోం కాదు. సోమనాధ అయ్యంగార్ ఎస్. ఏ. ఇండస్ట్రీస్ లిమిటెడ్ టింబాక్టు.

సో:- ఏమిటండీ అయ్యా! గురూ నేను మళ్ళీ ఆ కాఫీక్లబ్ సర్వరు పనేనా?

రా:- మరేమిటిరా భూమి గుండ్రంగావుందని చదువుకోలేదూ చిన్నప్పుడూ? చెడ్డా పడ్డా శ్రీకాకుళమే చేరాలి.

గా:- సర్వరువికాదురా! పెద్ద ఏజంటువి. ఎస్. ఏ. ఇండస్ట్రీసు లిమిటెట్ టింబాకూ.

సో:- అవునురా ఢింబకా!

గా:- ఇక గూడకట్టూ అరవమాటలూ అంతా అలాగే వుండాలి.

సో:- [గబగబ లోపలికి వెళుతూ] ఆము ఆము [లోపలికి వెళుతూంటాడు]

రా:- ఎన్నా సోమనాధఅవర్గళ్! ఇడ్లీసాంబారు రొంబ పసందుమ్మాయిరి

గా:- ఇక నీ వేష మేమిటిరా రాం.

రా:- రేలంగి వేషం వేస్తాను. [చిలకన్న చిలక వేపాట లంకించు కుంటాడు]

గా:- ఉస్సు! అపరా, రామ్‌చందుశాట్లీభాయ్ బ్రోకర్
రిప్పన్‌గోల్డుఫీల్డ్సు జకార్తా
రా:- రామ్‌చందు శాట్లీబాయ్, బుడ్డిదాసునని పేరులో
కూడా ఎందుకుగురూ?
గా:- ఏం బుడ్డికొట్టిస్తున్నవాడివి పేరుపెట్టుకొంటే తప్పా!
నువ్వు జకార్తానుంచి వచ్చావు. ఇండోనేషియాగాను
చిన్న షోలాబ్రడ్ మాటయాసగా హిందీ... తెలుగు
ఏదీ తెలిసింబా! క్యాజీ రాంచంద్రజీ.
రా:- జీ! గౌరీపతీజీ మాకి గోల్డుఫీల్డులో కడ్డీకికడ్డీబంగారం
మీాకు కావాలా?
గా:- ఆఁ కావాలి ఇస్తారా
గా:- హాఁ ఖరార్! బేరం హుషార్.
గా:- ఖరార్ [ఇద్దరూ చేతిలోచెయ్యి వేసుకొని నవ్వుకొం
టారు]
రా:- ఉండండి! డ్రస్‌మార్చి వస్తాను. [లోపలికి పోతాడు]
[ఇంతలో టెలిఫోనుపిలుపు వస్తుంది.]
గా:- [టెలిఫోనుతీసి] హాల్లో ఎవరూ...ఆ చిరంజీలాల్
జున్‌జున్‌వాలా...

[అప్పన్న ప్రవేశిస్తాడు]

అ:- ఎవరుబాబూ?
గా:- చిరంజీలాల్‌జున్‌జున్ హాల్లో ... ఎవరూ...గోల్డు
కోస్టు, గోల్డుమైన్సు అండ్ కో కోలార్ ... హాల్లో
అంటే పెద్ద బంగారంఅమ్మేకంపెనీ.

అ:- ఏ దేశం బాబూ.

గా:- [టెలిఫోను ఒకచేత్తో మూస్తూ] కోలారు... అంటే మైసూరు రాష్ట్రంలో ... [ఫోనులో] హలో నేను గౌరీపతీ అండ్ కో గోల్డుపర్ చేజర్సు.

అ:- ఏమంటున్నారు బాబూ.

గా:- [ఫోనుమూసి] నీ కనవసరం. వెళ్ళు నీపని చూసుకో [కసురుతాడు]

అ:- తమఅవుసరం నా అవుసరంకాదా బాబూ ... చిత్రం. [వెళ్ళిపోతాడు]

గా:- [తిరిగి ఫోనులో] ఆ సేఠ్ జీ... వస్తున్నారా...తప్ప కుండా దయచెయ్యండి ... ఎప్పుడువస్తారు? ఆ ... ఇప్పుడే ... అచ్ఛా ... తప్పకుండాగండి ఇక్కడే వుంటాను.

గా:- [మూలపడిన సైనుబోర్డుతీసి మేకుకి తగిలిస్తాడు, లోప లున్నించి ఇంకొకవైపునుంచి సోం రాం ప్రవేశం]

సో:- అడియేం దా సోహాం తొందర

రా:- జై రాంజీకి...షావుకార్ సాహెబ్ జై రాంజీకి [కా రాగిన చప్పుడు సేఠ్ చిరంజీలాల్ ప్రవేశిస్తూంటాడు]

సే:- జై గోపాల్ జీకి గౌరీపతీజీ జై గోపాల్ జీ

గా:- [ఎదురుగావెళ్ళి] జై గోపాల్ జీ దయచెయ్యండి సేఠ్ జీ, ఇంతలోనే వచ్చేసారా కూర్చోండి.

సే:- అచ్ఛా [కూర్చుంటూ] అనంద్ హై.

గౌ:- ఆ రాధాకృష్ణునిదయవలన అంతాక్షేమం. మీపేరు వినడమేగాని ఎప్పుడూ చూడలేదు, తమర్ని చూచి చాలా సంతోషమయింది.

సే:- మిమ్మల్నిచూడాలని వచ్చాం మిమ్మల్ని చూడాలని కోరిక చాలా వుండింది: ఖుషీహై ఆప్కో దేఖ్.

గౌ:- అన్నట్లు మరచాను. మిత్రుల్ని మీకుపరిచయం చేయలేదు [సోంని చూపిస్తూ] వీరు పూజ్య శ్రీ సోమనాథ అయ్యంగార్ ఏజంట్ యస్. ఏ. ఇండ్రస్ట్రీప్ లిమిటెడ్ టింబాకు టు]

సే:- టింబకూ.

సో:- ఆమ అదయేం అపరం రొంబ ఆనందమాయిర్ [షేక్ హేండు చేస్తాడు]

సే:- ఆనందహై కూర్చొండి [రాంని చూపిస్తూ] వొర్ ఆప్.

గౌ:- [రాంని చూపిస్తూ] రాంచంద్ బాట్లీబామ్ బ్రోకరు. రిప్పన్ గోల్డు పీల్డ్సు జకార్తా...

సే:- జకార్తా...

రాం:- జై రాంజీకి! సేట్‌సాబ్!

సే:- జై మదనగోపాల్! గౌరీపతిజీ! జకార్తా దక్షిణాదిని ఉందీ!

రాం:- ఉత్తరా...

గౌ:- ఉస్సు...ఇండోనీషియాలో ఉంది.

సేః- ఇండోనీషియాలో మాది బ్రాంచి ఉంది మా బ్రోక రు బఖర్ ఆలీ అక్కడ ఉంటాడు అప్కామాలూమ్ హై!

రాంః- పూరా మాలూమ్! నేను వచ్చేముందు.

సేః- ఆయన మీకు మీకు పీడ్కోలు విందు చేసాడన్నారు గా...

రాంః- హా! జరూర్! ఎంత చక్కని విందు ఇచ్చాడ్. వేలూ వేలూ ఖర్చుపెట్టాడ్.

సేః- క్యాప్యారీహైభాయ్! ఖర్చుఎంతవుంటే నఫా అంతా!

గౌః- ఉదారులు! మీరు ఖర్చు పెట్టకపోతే మరింకెవరు ఖర్చుపెడతారు! [అప్పన్న 4 కప్పుల టీ పెట్టిన ట్రేతో ప్రవేశం]

సేః- అరే మీరు చెప్పకుండానే ఛా తెచ్చాడ్ మీదీ నౌఖరు మీకంటే మర్యాద తెల్సుంటుంది.

గౌః- [అప్పన్న వేపు అదోలాగా చూస్తూ] అలాగే! నా నౌఖ ర్లుకి నే నేపనీ చెప్పనక్కర్లేదు. అన్నీ మిషనులాగా రొటీనుగా చేసుకుపోతారు.

సేః- మిషను హుండీ! హెడ్ ఎక్కడాహుండీ!

గౌః- అదేప్ప కొనుగోలు వ్యాపారం. మిషనులు మాకెంతకూ మిషన్లుతిరిగినట్లు పనిచేసుకుపోతారు అంతా.
[అంతా టీ త్రాగుతూంటారు]

సోః- గౌరీపతీవరే! అవరు సాయంత్రమే ప్రయాణం దా దుడ్డు కుడుంగో చాలాదినాలయింద్రి.

[ట్రైనింగటంఅయాక అప్పన్న కష్టాలుపట్టుకుపోతాడు

గౌ:- అలాగే. [కట్ట తెచ్చి సోంకియిస్తూ] ఇప్పటి కివి జమ కట్టుకోండి. మిగతావి ఆ తక్కిన రెండువందల తులాలు అమ్మి రేపుసాయంకాలానికి చెల్లిస్తాను.

సో:- ఎన్నసారి! వాయిదా బేరం నల్ల ముకి సూరాసు. ఈ సారికి అంగీకారం స్తానే అపరం ముడియరాసు కలత్రు.

గౌ:- కలవు [సోం నిష్క్రమిస్తాడు]

సే:- ఎంతబంగారం కొన్నార్.

గౌ:- అబ్బే ఎంతో లేదు వెయ్యితులాలు కొన్నాను. ఫర్నాండ్ అండ్ కో వాళ్ళు మొదట 10 వేల తులాలు కావాలని ఆర్డరిచ్చారు. మాటమీద కొన్నాను. తీరా వచ్చేసరికి ప్రస్తుతానికి 500 తులాలకంటె ఎక్కువ అక్కరలే దన్నారు.

రాం:- సేఠ్ జీ! నాకు చుట్టీ ఇప్పించండి.

గౌ:- మీ కేం తొందర! సేట్జీతోటే వెల్దువుగాని.

సే:- ఠైక్ హై జీ.

రాం:- లేదు సేఠ్ జీ! ఈ సమయంలో వస్తానని సేఠ్ హరగోవింద్ కు మాటయిచ్చాను.

సే:- హరగోవిందు మీకు దోస్తు హై!

గౌ:- ఆయనకూ మాకూ ఖాతావుంది.

రాం:- గౌరీపతీజీ... సేఠ్ జీ ... రాంరాం ఫిర్ మిలేంగే. (పోతూంటే)

గా:- బాట్లీభాయ్ [సంచి పట్టుకొనివెళ్ళి] ఆప్ కాజేగ్ మరచిపోయారు.

రా:- ఓ!! [సంచి తీసుకొని వెళ్ళిపోతాడు]

గా:- [సిగరెట్టు యిస్తూ] సిగరెట్టు సేట్జీ.

సే:- జై మదనగోపాల్! అలవాటులేదు. గౌరీపతిజీ! ఒక్క జరూర్ పని ఉండి వచ్చాము... ఆప్కా మర్జీ హై!

గా:- తప్పకుండా! మీ అవసరానికి నేను ఆదుకోనా సేట్జీ.

సే:- ఒటింగా కామాల్ 10 వేలకు పడవ దిగింది. హెడ్డాఫీసు సే పైసా రాలేదు. 5 వేలు అందింది. 5 వేలు తమరూ ఇస్తే...

గా.- [చేతులో చెయ్యి వేస్తూ] మనం నేస్తులం' మీ అవసరం నా అవసరం కాదూ. తప్పకుండా ఇస్తాను.

సే:- బహుత్ షుక్రియా! రేపు ఈపాటికీ సొమ్ము వాపసు చేస్తాం.

గా:- డబ్బు రూపంగా ఎందుకు- బంగారం ఎలాగూ కొనాలనుకుంటున్నాను. పర్ మెండు అండ్ కో వాళ్ళు రేపటికి ఆఫర్ యిస్తారు.

సే:- అచ్చా! అలాగయితే రేపు బంగారం పంపిస్తాను.

గా:- మీరే దయచెయ్యండి. మనకి మధ్యవర్తు లెందుకు? [లేచి 5 వేలు కట్ట ఇస్తాడు]

సే:- [అందుకుంటూ] షుక్రియా [లేచి వెళ్ళిపోతో నోట్లు పరీక్షగా చూసి పెదవి విరచి వెళ్లిపోతాడు]

(అప్పన్న తొందరగా వచ్చి)

అ:- బాబూ ఆకట్ట——!

గా:- వెర్రివాడా! అంత తెలీనివాణ్ణనుకున్నావా! అసలు నోట్లకట్టే ఇచ్చాను. పిట్ట మన వలలోపడేదాకా నకిలీనోట్లు బైటికిరావు.

అ:- అమ్మయ్యో చాలా గాభరాపడ్డాను.

గా:- [టైముచూసి] అబ్బో 7-30 అయిందే——క్లబ్బుకీపాటికి శేఖరంవచ్చి ఉంటాడు. అప్పన్నా అమ్మగారేం చేస్తున్నారు?

అ:- బట్టలు వేసుకుంటున్నారు. తమరిని త్వరగా క్లబ్బుకి వెళ్ళమన్నారు. క్లబ్బులో కలుసుకుంటామన్నారు.

గా:- త్వరగా రమ్మను.

కలలో

కలికాలం

తలలో

చలికాలం

తగులుకొన్న ఈ ఉచ్చులు - మిగిలిపోయె

మిగిలిపోయె [నిష్క్రమణ]

[అప్పన్నకూడా అతనివెంబడే నిష్క్రమిస్తాడు. కొంతసేపు నిర్మానుష్యం. నిశ్శబ్దం]

[ఇల్లంతా కలయచూచుకుంటూ శిశిర్ కుమార్ అందంగా టక్కుపల్చగా అప్‌టూడేట్ సూటుతో ప్రవేశిస్తాడు.

శశి:- ఓనా చెలీ
ఓ నా సఖీ
తూగుటుయ్యాలలో
ఊగు జొంపాలలో
కదలిరా! కదలిరా!
ఓనా చెలీ!
ఓ నా సఖీ

జలదాల పల్లకిలో
జలతారు దారిలో
కలహంసవైనీవు
కదలిరా కదలిరా
ఓ నా చెలీ ఓ నా సఖీ

శో:- మేడమెట్లు దిగుతూంటూంది]

శశి:- ఆనందసంద్రవై
అందాలదీవివై
వలరేనిచిలుకవై
వలపించుకలికివై
కదలిరా కదలిరా
ఓ నా చెలీ – ఓ నా సఖీ

శో:- వండర్‌ఫుల్! ఎక్సలెంట్!! లాలీ!!! స్వీట్!!! వెరీ స్వీట్ [మత్తిల్లి ఊగుతూంటుంది]

శశి:- యుగయుగాలతపస్సు
జగజగాలతిమస్సు
పరిణమించినవి_నను
పరిహసించెను_మనల
కలహంసగామినీ
వలపించు కామినీ
బిల్హణునియామినీ
ప్రణయజీవనధునీ!

కదలిరా! కదలిరా!
ఓ నా చెలీ!
ఓ నా సఖీ!

శో:- స్వప్నసుందరం...కల కంటున్నానా!

శశి:- కాదు నిజాన్ని దర్శిస్తున్నావు.

శో:- ఏ ప్రత్యక్ష బిల్హణుడు నాకు సాక్షాత్కరించేడు! ఏ జయదేవుడు నన్ను నర్తింపజేస్తున్నాడు.

శశి.- చనిపోయిన జయదేవుడు కాదు. చరిత్రహీనుడు బిల్హణుడు కాదు. యువకవి—మహాకవి శిశిర్‌కుమార్.

శో:- శిశిర్‌కుమార్—నాస్వప్నప్రేమికుడు—నా హృదయ చోరుడు నాప్రణయ సామ్రాట్టు.

శశి:- ఆ! అవును ఓ అజ్ఞాత ప్రణయమూర్తి! ఏ శిశిర్ కుమార్ కోసం నీవు అహరహము కలలు గనీ, కోరి

రమ్మనీ పత్రికలో వేయించినావో ఆ నీ ప్రణయ సామ్రాట్టూ, ఆ వాంటెడ్ కోలం ఆసామీ, తద్వాం టెడ్ కోలం కటింగుతో సహా నీముందు సాక్షాత్క రిస్తున్నాడు——తరించు...నన్ను అనుగ్రహించి...

శో:- తరించాను. అనుగ్రహించడ మేమిటి ఆరాధిస్తాను. అయ్యో !నిలబడే ఉన్నావే!

శశి:- ఓ! సారీ! మైకంలో సోఫాలున్నాయన్న సంగతి మరచిపోయాను. అహా మిచ్చట ఉత్తిమం [కూర్చుం టాడు]

శో:- మీ గేయాలు నాకు పంచప్రాణాలు. మిమ్మల్ని ఎన్న టికేనా కల్సుకోనగలనని నాకు నమ్మక ముంది. ఆ నమ్మకంతో ఎందరినో త్రోసిరా జంటూ వచ్చా ను. [సిగరెట్టు ఇచ్చి అగ్గిపెట్టి వెలిగించి ముట్టింపిస్తుంది]

శశి:- అవును, దేవీ! అదిచరిత్రసత్యం. సిరిన్ ఫరాద్, లైలా మజ్నూ, బాలరాజు, మాయలోకం, చివరికి బాల నాగమ్మ ఇదే చాటుతున్నాయి. గాలిబ్ కోసం చాందరి ఆత్మహత్య చేసుకుంది. తాన్ సేన్ కోసం ఖుర్షీద్... అంటే అదే ఆవేశం పేరు జ్ఞాపకం లేదు. వర్షాన్ని కురిపించింది...ప్రేమకోసం త్యాగంచెయ్యాలివా కేరీ! ఆమాట కొస్తే నేనూ త్యాగంచేస్తాను.

శో:- వద్దు స్వామీ! మీ రే త్యాగం చేయవద్దు. నేనే నా సర్వస్వాన్ని త్యాగం చేస్తాను.

శిశి:- సిగ్గుచేటు! ప్రేమకోసం, కవిత్వంకోసం, నేను ఇదివరకు చాలా త్యాగం చేశాను. నా మనో నేత్రంలో ఏమో కనిపించింది. సరీ . స్కూలుఫైనలు పరీక్షలముందే నా మొట్టమొదటి విరహగీతం వ్రాశా ను. మెయిలురాయబారికి నా సందేశాన్ని అహర్ని శాదులు వినిపించాను. పరీక్షలో తప్పాను. ఆ వేస విలో నా రెండో విరహగీతం వ్రాశాను.

శో:- ఆగీతాలన్నీ నా కొచ్చు స్వామీ.

శిశి:- నాకూ చాలాకాలం జ్ఞాపకం ఉండేవి. కాని ఇప్పు డవి మరచిపోయాను.

శో:- నేను పాడి నాట్యంచేస్తాను. మీరు తిరిగి జ్ఞాపకంచేసు కుందురుగాని.

శిశి:- అబ్బే అక్కరలేదు. ఇప్పు డంతకన్నా ప్రౌఢకవిత్వం రాస్తాను. అప్పుడు చంద్రుణ్ణి చూచి తిట్టాను. ఇప్పుడు ఎండ తట్టుకోలేక సూర్యుణ్ణితిట్టి చంద్రుణ్ణి పొగుడు తాను. అప్పుడు తామరతూళ్ళూ, తామరఆకులూ, పద్మాలూ కావాలన్నాను. ఇప్పుడు అవన్నీ అక్కర లేదు. చల్లన్నంవుంటేగా తామరాకుకి. అధమం ఒక కప్పు గరంచా కావా లంటున్నాను. అప్పుడు పూవు టీరాలు కావాలన్నాను. ఇప్పుడు పేవ్మెంటుమీద కాస్తచోటుంటే చాలు. అదే తాపోపశమనం. ఈనాటి కవితావస్తువు కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ

ఆపైన మహాకవి నైపోయాను. శశికుమార్, గేయ
సామ్రాట్టు నైపోయాను.

శో:- ఆహా! మీరు మాట్లాడుతున్నా కవిత్వంసాక్షాత్కార
మవుతూంది.

శశి:- అందుకే ఆ బాకా సంపాదకుడు నన్ను చదువుల సర
స్వతి అంటాడు. ఇప్పుడు మనిద్దరం ఒకపని చేయాలి.

శో:- మీరేంచేయమన్నా చేస్తాను.

శశి ఒక్కనిమిషం మనం మోకాళ్ళమీద కూర్చొని శిర
స్సులు వంచి, కళ్ళుమూసుకొని, చేతులు జోడించి,
నడుము వంచి, మనలను ఏకంచేసిన సుప్రసిద్ధ జాతీయ
పత్రిక "బాకాకు" అంజలి ఘటించాలి.

శో:- [లేచి] ఛీ! శఠకోపంగాడికా మనం దణ్ణంపెట్టడం!

శశి:- ఏం?

శో:- వాడు దుర్మార్గుడు ఎన్నిమార్లు నిన్ను తీసుకురమ్మ
న్నా తీసుకువచ్చాడు కాడు.

శశి:- మన సంయోగం అంత త్వరగా జరిగితే ఎలా? సస్
పెన్సు దెబ్బ తినదూ! ప్రణయినీ ప్రియులు వెంటనే
కలుసుకుంటే దాంట్లో డ్రామా ఏదీ? నలుడుకీ దమ
యంతికీ మధ్య హంస, రుక్మిణికీ కృష్ణునకూ మధ్య
సుదేవుడు, అనిరుద్ధునికీ ఉషాసుందరికీ మధ్య చిత్ర
రేఖ, మనిద్దరికీ మధ్య ఆంధ్రప్రభ వాంటెడ్ అడ్వర్
టైజ్ మెంటు ఇదే వరస. ఇప్పుడే డ్రామా అయింది.
ప్లీజ్! కొంచెం మంచినీళ్ళు.

శో:- అయ్యో, మీ ధోరణిలో ఆతిథ్యమే మరచిపోయాను. అప్పన్నా! అప్పన్నా!

శిశి:- వా డెవడు? వా డొస్తూ పానకంలో పుడకలాగ!

శో:- వాడు మన నౌకరు! అప్పన్నా! ఎక్కడా లేడే! ఉండండి. పోనీ, నేనే వెళ్ళి టీ చేసి పట్టుకు వస్తాను.

శిశి:- శ్రమపడకు, ప్రేయసీ! టీ నా కక్కర లేదు. నేను పూర్వం టీ తాగేవాణ్ణి! తర్వాత దేశం కాని దేశం వెళ్ళడంచేత దొరుకుతుందో దొరకదో అని ఆ అలవాటును తప్పించి పరిశుభ్రమైన మంచినీళ్ళనే సేవిస్తున్నాను.

శో:- పోనీయండి! నీళ్లే తెస్తాను. [అంటూ తొందరగా వెళ్ళి గ్లాస్‌తో నీళ్ళు తెచ్చి ఇస్తుంది]

శిశి:- [నీళ్ళు తాగి] నాకసలు ఫ్రిజ్ బాటిల్లో ఉంచిన నీళ్లు తాగడం అలవాటు. అందులోనూ కవిత్వం వ్రాస్తున్నప్పుడు ఆ చల్లనినీరు ఒక్కొక్కగుటక ఒక్కొక్క నోబిల్ ప్రైజ్ ఐడియా పడుతూ ఉంటుంది. నేను పారిస్‌లో ఉన్నప్పుడు ఆ అభిప్రాయాలకోసం పిల్లకవులూ, పబ్లిషర్లూ, విమర్శకులూ, బహుమతి నిర్ణేతలూ, వడ్డికాసులవాళ్ళలా కాచుక్కూర్చొనే వారు. ఐడియా పడిందీఅంటే ఫినిష్. ఆ ఐడియాను మోసుకొనిపోయేవారు. మర్నాడు పేపర్ల నిండా ఆ ఐడియాయే. విమర్శకులు, వ్యాఖ్యలు, ఉపోద్ఘాతాలు అంతా దాన్నిగురించి. ఇదంతా ఒక్క

ఐడియాగూర్చి. మనవాళ్ళు అన్నారు—వాక్యం
రసాత్మకం కావ్యం అని. ఎందుకూ దొంతులు, దొం
తులు పుస్తకాలు వ్రాసినా అతీ గతీ లేదు. పూజా
పునస్కారాలు లేక బూజుపట్టి పోతున్నారు ఉద్దం
డులలాంటివాళ్ళుకూడాను ఈమధ్య ఒకవింత జరిగింది.
ఒకాయన కలవరించాడట. ఆకలవరింతఒక పబ్లిషరు
ఆ ప్రక్కనే పడుకొని విన్నాడట. అంతే. మర్నాడు
ఆ కలవరింతను పద్యపాదంగా ప్రకటించాడు దానిని
వ్యాఖ్యానించినవాడికి ఏంద డాలర్లు, ఆ కలవరింతకు
రెండువందల డాలర్లు ఇచ్చాడట. అదీ కవితాదరణా!
ప్రజాదరణా!.

శో:- ప్రజలతో మీకేమి పని స్వామీ! నే నున్నానుగా
మిమ్మల్నీ మీ కవిత్వాన్నీ ఆదరించడానికి.

శశి:- సరే! నాలాటి ఏభావుకుడికో ఇలాటి భార్య తటస్థ
పడుతుంది. మరి నా సోదరకవులగూర్చి, నా సోదర
కళాకారులని గూర్చి ఆలోచించవద్దూ! అందుకనే
కళాకారుల నందర్నీ ఒక సంస్థక్రింద ఏర్పాటుచేశాను.
వారందరికీ తిండిగడిచేఉపాయ మొకటి ఆలోచించేను.

శో.- క్షమించండి! మీ రంగీకరిస్తే నాట్యంచేసి మీ ఆశయ
సిద్ధికి తోడ్పడతాను.

శశి:- వెరీగుడ్! అలాఉండాలి కళాహృదయమంటే! అలాగే
చదువు సంస్కారము కలిగిన యువతులు కళాసేవకు
ముందుకు రావాలి. ఈ ఉద్యమంలో నేనూ బళ్ళారి
రాఘవుడూ నిద్రాహారాలుమాని శ్రమించాం. అతను

నా భుజస్కంధాలపైని ఈ ఉద్యమభారాన్నంతటినీ
ఉంచి అమరుడైనాడు. ఆ మహానాయుని ఆశయ
సిద్ధియే నా జీవితలక్ష్యం. ఒక్క నాట్యమే కాదు,
నాట్యం, నాటకం. సస్పెన్సు మ్యూజిక్ అంతటి
తోటీ ఒక చిత్రమైన సినిమా తీయ సంకల్పించాను,
ప్రేయసీ నీ ఆజ్ఞ ఉంటే

శో:- అయ్యో! స్వామీ! నా ఆజ్ఞ అంటూ రేమిటి? నేనూ, నా డబ్బూ, నాసర్వస్వంమీదే. మీయిష్టమేనాయిష్టం!

శిశి:- ఆ చిత్రం ఇప్పటివరకూ వచ్చిన చిత్రాలన్నిటికీ తలమానికం. దాంట్లో ఆధునిక కవులంతా పాటలూ, మాటలూ వ్రాస్తారు. సుప్రసిద్ధ చిత్రకారులంతా కళా దర్శకత్వం చేస్తారు. ఒకపూర్వపాం దశాపరేషాం అంటే ఒక దశాబ్దానికి ముందూ, ఒక దశాబ్దానికి వెనకా అటువంటి చిత్రం లేదు, రాబోదు, రాదు.

శో:- మీ పాట లుంటాయా?

శిశి:- ఉంటాయి. ఒకటి రెండు నీకు నచ్చినవి నీచే పాడించి, నాట్యం చేయిస్తా. లేడీ క్రిస్టీన్, మాయా పెసెపె స్కాయా, మరాత్రిగహాం, కస్కూ, మిస్ కుంకుం, మిస్ టిం టిం మొదలగు నర్తకీమణుల గుండెలు చల్లబడిపోవాలి వరల్డు మార్కెట్ పిప్పూ పాట్, హాటూ హాట్.

శో:- అబ్బా! ఈ జీవితాని కింతటితో స్వస్తి చెప్పుతాను. పదండి. డబ్బు పట్టుకొని వెళ్ళిపోదాం! హాయిగా ఆ సినీమా ప్రపంచంలో జీవిద్దాం.

శశి:- అంత తొందరపడితే ఎలాగ. హాలీవుడ్ జిప్సీతో పాటు నీ దగ్గర తిరగడానికి అంటే పిక్చర్లో - స్టాండినేవియానుండి మిస్టర్ బరన్ హాండ్ తాలూకు కుక్కను తెప్పిస్తున్నాను. ప్రయత్నాలన్నీ పూర్తయాక ఇక్కడనుంచి "పాచికపారినట్లయినా రామవనం చలో—"

శో:- అబ్బ! చాలా రాత్రులయింది. మేడమీదకు వెళ్దాం రండి!

శశి:- నీ దర్శన భాగ్యమైంది. మిత్రులంతా కూర్చొనుంటారు. ఆ మ్యూజిక్, డైరెక్ట రీపాటికి నా గేయానికి ట్యూనిస్తూంటాడు.

శో:- నేనూ వచ్చి వింటాను

శశి:- అబ్బ ఒక్కపాటకు రెండువేలు పుచ్చుకుంటున్నాడాయన.

శో:- ఆ ట్యూను రికార్డు చేశాక తీసుకురండి.

శశి:- రికార్డు చేశాకా? అంతవరకూ ఎందుకూ? నీ కోరికే అదైతే యిప్పుడు రికార్డు చేయించి పట్టుకురానూ?

శో:- అయితే మీరు వెళ్ళక తప్పదా?

శశి:- తప్పదు - రేపీపాటికి వస్తాను.

శో:- అబ్బా! రేపీపాటికి! నాకళ్ళు కాయలు కాచిపోతాయి.

శశి:- అయ్యో! నీకళ్ళు కాచిపోతే నేనుచూడగలనా? త్వరగా వస్తాను.

శో:- ఈ రాత్రికే వచ్చేయండి ప్లీజ్.

శశి:- ఎలా? ఊరిచివరి మార్వాడీ దగ్గరకెళ్ళి అధమం రెండు వేలేనా పట్టుకుని వెళ్ళి, ఆ మ్యూజిక్ డైరెక్టర్ కిచ్చిస్తే

గాని, రేపు డిస్ట్రిబ్యూటర్ వచ్చే వేళకు పాటరికార్డు కాదు. క్షమించు: ఇదంతా ఆలస్యమౌతుంది.

శో:- రెండువేలకోసం నాస్వామి ఆలస్యమా! మిస్టర్ కుమార్! ఇవిగో రెండువేలు [కట్టలు బ్యాగ్‌లో పెడుతుంది] ఒకగంటలో రండి! డార్లింగ్!

శిశి:- డార్లింగ్! స్వీటుహార్టు! రెక్కలు కట్టుకొని వెళ్ళి మళ్ళీ ఎగిరి వస్తాను. హెలికాప్టరులా సరాసరి నీమేడ మీది వసారాలోకి డ్రైవ్ చేసి ల్యాండు అవుతాను. చీరియో!

శో:- [దిండు నొత్తుకుంటూ] టా! టా!

[శిశిర్ నిష్క్రమణ]

[అప్పన్న ప్రవేశం]

అ:- ఏమిటమ్మా క్లబ్బుకు వెళ్ళలేమా?

శో:- ఏం నన్నడుగుతున్నావు, నువ్వు వెళ్ళలేదా?

అ:- లేదమ్మా! దార్లో స్నేహితుడు కనిపించి సినీమాకు తీసుకెళ్ళాడు.

శో:- ఆఁ! అప్పుడే సినిమా తీసేశారా? లేదు! ఇంకా ఆయన రాందే!

అ:- ఆయనా? ఎవరు? గౌరీపతిబాబా!

శో:- కాదురా! ఆయన!

కదలిరా! కదలిరా!

ఓ నాచెలీ! ఓనాసఖీ!

కాదు...ఓనాసఖా! ఓనాప్రియా!

[తెర పడుతుంది]

# రెండవ రంగం

(అదే స్థలం—శోభ నిరీక్షిస్తూ)

శో:- అప్పన్నా! ఆయ నింకా రాలేదా?

అ:- ఎవ రమ్మా! గౌరీపతి బాబా?

శో:- కాదు! శిశిర్ కుమార్! నా హృదయాధిదేవత!

అ:- ఆయ నెవరమ్మా? నేను ఇక్కడ ఎప్పుడూ చూడలేదు.

శో:- నీ వెరుగవు అప్పన్నా! ఈ యెడారిలో ఆయ నొక అమృతమూర్తి.

అ:- ఎప్పొడొస్తా నన్నారు?

శో:- ఇప్పుడే గంట సేపయాక.

అ:- గంటఏమిటమ్మా? తెల్లవారుతోంది.

శో:- అబ్బా! గుండె బరువెక్కిపోతోంది. నాకళ్ళు మూసుకు పోతున్నాయి. [ఒళ్ళు విరుచుకుంటూ సోఫాలో కూల బడిపోయి కళ్ళు మూసుకుంటుంది]

అ:- కాఫీకాచి తెస్తానమ్మా [పోతాడు]

శిశి.- [గాభరాగా ప్రవేశం. శోభనుచూచి] ఆహా! ప్రేమ చకోరి! చంద్రదర్శనానికిఎదురుతెన్నులుచూచి విసిగి వేసారి కన్నుమూసింది. ఆహా! తేనెలొలుకు ఆ అర్ధ నిమీలితనేత్రాలలో పిల్లచేపలు త్రుళ్ళింతలాడు తున్నాయి. ప్రేయసీ! ప్రాలాను నీప్రేమాల.

శో:- ఆ! వచ్చావా! కుమార్! డార్లింగ్!

శిశి:- ప్రియా! కొంపమునిగింది. ఏ వేషాలూ స్వచ్ఛమైనవి కావు, నీ విచ్చిన కరెన్సీనోట్లు. అందులో దొంగ కరెన్సీనోట్లున్నాయి.

శో:- క్షమించు స్వామీ! మీ రసీగారన్న ఆనుర్దాలో, అసలునోట్లకు బదులు నకిలీనోట్లిచ్చాను.

శిశి:- ఈనోట్లు పుచ్చుకోనని, ఆ మ్యూజిక్ డైరెక్టర్ నాపాటకు ట్యూను ఇవ్వలేడు. ఒక్క గంటలో డిస్ట్రిబ్యూటర్ వస్తాడు. ఆపాట రికార్డు కాకపోతే మనఆశలు నిరాశలై పోతాయి. స్వర్గసుఖా లనుభవిస్తా మనుకున్న మనం ఘోరనరకంలోనికి దిగజారి పోతాం!

శో:- అయ్యో స్వామీ! చెప్పకండి స్వామీ! మీరు చెప్తూంటేనే నాకు భయం వేస్తూంది. ఉండండి. ఆనోట్లలా వుంచండి! నేను మేడమీదకు వెళ్ళి అసలు నోట్లను తీసుకొని వస్తాను. [చరచరా మేడమీదకు వెళుతుంది]

శిశి:- అదీ త్యాగం! అలా దానంతట అది ఉట్టిపడాలి! పూర్ ఉమన్! దీని తాపత్రయం చూస్తే నాకు జాలి వేస్తోంది. (శతకోపం వస్తాడు)

శ:- గౌరీపతీ! గౌరీపతీ! [సోఫాలో శిశిర్ అదోవైపు నిర్లక్ష్యంగా చూస్తూ కూర్చుంటాడు] హల్లో! మీ రెవరు!

శిశి:- కనపడలేదూ! నేనూ నీలాంటి మనిషినే!

శ:- ఆ సంగతి చెప్పక్కరలేదు మీరు గౌరీపతి స్నేహితులా!

శిశి:- గౌరీపతి! ఆయ నెవరు!

శ - ఈ ఇంటి జమీందారు.

శిశి:- అయ్యో! శోభ భర్తా?

శో:- [మెట్లమీదినుంచి] కాదు, సెక్రటరీ! ఒకదిక్కుమాలిన పక్షి [గబగబా దిగివచ్చి నోట్లు శిశిర్‌కి యిస్తూ] డార్లింగ్! త్వరగా వచ్చేయండి.

శిశి:- ఓ! ఇప్పుడే వచ్చేస్తాను [అంటూ విసురుగా వెళ్ళిపోతాడు]

శ: అయ నెవరు శోభాదేవీ?

శిశి:- నా ఆత్మీయ కవి శిశిర్ కుమార్!

శ:- కాదు. దగా. మోసం. వా డెవడో పచ్చిదగాకోర్.

శో:. నటప్. నువ్వు వచ్చిన పని చూసుకో. నా స్వంత విషయాలలో జోక్యం పెట్టుకోకు.

[గౌరీపతి చిరాకుగా ప్రవేశం]

గౌ:- ఆపాటిదానికి నన్ను వెళ్ళమనడం ఎందుకూ? నువ్వే రానని చెప్తే సరిపోయేదిగా. నేనుకూడా వెళ్ళేవాడినే కాను. అసలు డబ్బంతా పెట్టి పేకాట ఆడేశాను. నకిలీ డబ్బు మార్చడమే దుర్లభమైపోయింది.

శో:- ఏం, రావాలని వ్రాసిపెట్టుందా? నిన్నరాత్రి నా నందనోద్యానవనంలో మురళీమోహనుని దర్శించేను.

గౌ:- ఆహా! ఆ దేవునికి దర్శన మియ్యడానికి జాబితాలో మునీశ్వరు లెవరూ మిగలలేదు కాబోలు! సరాసరి నీ నందనోద్యానానికే దిగిపోయాడు.

శ:- వాడిమొహం! దగాకో రేవతో శిశిర్‌కుమార్ అని పేరుపెట్టుకుని దిగబడ్డాడు.

గో:- ఏమిటి! శిశిర్‌కుమార్! ఏడీ ఆ 420? ఎక్కడున్నాడు? వెంటనే పోలీసులకి అప్పచెపుతాను

శో:- షటప్! పోలీసులదగ్గరకు వెళ్ళేంత ధైర్యంఉన్నట్టు! ఆ సుందరమూర్తిని అన్యాయంగా ఆడిపోసుకుంటున్నారు.

శ:- ఎలా? ఈ పద్మవ్యూహాన్ని ఛేదించడ మెలాగ?

గో:- ఏం? ఆ వచ్చినవాడిని నిలబెట్టలేకపోయేవ్?

శ:- వాడు వెళ్ళాక తెల్సింది. ఈ సంగతంతా.

గో:- అయితే నా డొక డిటెక్టివ్ అయ్యాటాడు. ఇక మన బండారం బయటపడింది.

శ:- అంతేకాదు శోభ డబ్బుకూడా ఇచ్చింది.

గో:- డబ్బెందు కిచ్చావ్?

శో:- నాప్రియుని అవసరం నా అవసరమే. నీ కేం హక్కు వుంది న న్నడగటానికి?

శ:- ఈహక్కు బేహక్కులన్నీ రేపు దొరికిపోతే తేలుతాయి.

గో:- ఏముంది? అందరికీ మండలు విరగగొడతాను.

శో:- పీక విరగడౌతుంది. [అని పోబోతూవుంటుంది]

గో:- [కలయజూచి నోట్లుకట్టచూసి] ఇ దేమిటి? ఇక్కడి కీ డబ్బెలా వచ్చింది?

శో:- నేనే తెచ్చేను.

గో:- ఈ నోట్లెందుకు తెచ్చేవు?

శో:- ఆయన ఇచ్చేను. దొంగనోట్లనీ, మారదనీ తిరిగి తెచ్చి అక్కడ పడేశాడు. తిరిగి అసలునోట్లిచ్చేను.

గో:- కొంపముంచేవ్. [లెక్కపెడుతూ] ఎంతిచ్చావు?

శో:- రెండువేలు.

గో:- ఈ నోట్లు కూడానా?

శో:- అవును

గో:- అరే, ఇవి! 5 వందలే ఉన్నాయి.

శ:- అంటే, మిగతావి ఋజువుకోసం దాచాడన్నమాట.

శో:- మీ కర్మ! మీ వాదనలేవీ నా చెవికెక్కవు. [మేడమీదకు పోతుంది]

శ:- వాడెవడో వెంటనేపట్టుకోవాలి. కొంపతీసి ఈ ఉదంతం అంతా పోలీసులకు చెప్పేస్తాడేమో!

గో:- వీడే అయివుంటాడు, ఆ పేపర్లో వ్రాసిన సుధాకర్. సరే. వీడిపని పట్టించడం ఎంతసేపు. ఒరే సోం, రాం! [తెరలోనుండి 'చిత్తంగురూ' అంటూ ఇద్దరూ వేషాలలోనే ప్రవేశిస్తారు]

సోం:- ఏమి తలపు దేవదేవా?

రాం:- ఆజ్ఞ మహానుభావా!

శ:- అరే, యిదేమిటి? వీళ్ళిలా వేషాలు మార్చేశారు?

(అప్పన్న కాఫీతో వస్తాడు)

గో:- అదొక అవసరం. ఒరే సోం!

అ:- బాబూ! ఎంతలా మారిపోయారు! ఎవరో అనుకున్నాను మనవాళ్ళేనా...!

గౌ:- అప్పన్నా! నీ కంతా అనవసరం. నువ్వు వెళ్ళి పని చూచుకో.

అ:- చిత్తం [పోతాడు]

గౌ:- శిశిర్ కుమార్ ట!...

శ:- తెల్లగా, పొడుగ్గా, ఎగదువ్విన క్రాఫింగు; అప్ టు డేట్ బట్టలు వేసుకుంటాడు...

సో:- కలవలకంటే తెల్లగా ఉంటాడా?

రాం:- సున్నంకన్నా తెల్లగా ఉంటాడా?

గౌ:- అతివాగుడు వాగకండి.

శ:- వాడిదగ్గర రెండు వేలనోట్లు ఉంటాయి.

సో:- అసలువా?

రాం:- నకిలీవా?

శ:- అసలువే!

గౌ:- వాణ్ణి మంచిమాటలతో శోభకు వంట్లో బాగులేదనీ. అర్జంటుగా రమ్మన్నదనీ తీసుకురండి. తరువాత నాటకం నే నాడిస్తాను.

శ:- నేనూ కొంత సాధనసామాగ్రితో వస్తాను.

[నిష్క్రమిస్తాడు]

సో-రాం:- [ఇద్దరూ] జై బజారంగబలీ!

[నిష్క్రమిస్తారు]

గా:- [డ్రాయర్లన్నీ వెతుకుతూ...] అప్పన్నా! అప్పన్నా!

అ:- చిత్తం బాబయ్యా!

గా:- నా పిస్తోలేదీ!......ఈ డ్రాయర్లో ఉండాలి!

అ:- అదెందుకు బాబూ?

గా:- ఏం లేదు...వేటకు వెళ్తాలోంది...అది కావాలి.

అ:- చిత్తం...మొన్న మేడమీద గదిలో దాచాను. [వెళ్ళి తెచ్చి యిస్తాడు]

గా:- [పిస్తోలు జేబులో పెట్టుకుంటూంటే ఫోను మ్రోగుతుంది] అప్పన్నా ఎవరో పలుకూ.

అ:- చిత్తం. [ఫోనులో] హల్లో!... బాబుగారా... బాబూ తమర్నే.

గా:- అలాగా [ఫోను తీసుకొని] హల్లో! సేట్జీ [నవ్వి] వస్తున్నారా? దయచెయ్యండి [ఫోనుపెట్టి] అప్పన్నా! సేట్జీ వస్తున్నారు. చూడు టీ కాచి వుంచు.

అ:- చిత్తం. [కా రాగిన చప్పుడు]

సే:- [ప్రవేశిస్తూ] జై గోపాల్‌జీ! గౌరీపతీజీ!

గా:- [ఎదురేగి] జై గోపాల్‌జీ! దయచెయ్యండి.

సే:- ఏమిటీ! కొంచెం ఏకాకుగా కనిపిస్తున్నార్! తాబీయత్ అచ్ఛా నహీం!

గా:- ఆరోగ్యం బాగానేవుంది. రాత్రి స్నేహితులంతా రావడంనుంచి కొంచెం నిద్దర లేదు. అందుకోసమని అలా వున్నాను.

(అప్పన్న టీతో వస్తాడు)

అః- సేట్జీ! చాలా మంచివారు బాబూ!

గాః- సేట్జీ లేకపోతే ఈ ఇబ్బందులలో మనం తట్టుకోలేక పోదుం. అప్పన్నా నువ్వు వెళ్ళు [అప్పన్న పోతాడు]

సేః- బంగారం అమ్మేశారా?

గాః- అది చెల్లలేదు! సేట్జీ పోనీయండి దానికేమిటి? కొంచెం ఆలస్యంగా ఎప్పుడో అప్పుడు చెల్లిపోతుంది. మరచాను ఏమిటిలా వచ్చారు?

సేః- ఒక జరూర్ పని. షిప్‌లోనుండి 200 తులాల బంగారం వచ్చింది. మాణిక్‌భాయీ తీసుకువచ్చాడు. బడా అర్జంటుగా డబ్బుకావాలన్నాడు. మీకేమీ అవసరం ఉందీ ఏమో...

గాః- [నవ్వి] బంగారం కొనేవాడికి అవసరం లేకపోవడమేమిటి? ఎంతడబ్బుకావాలి? ఏదీ బంగారం?

సేః- బంగారం ఇదిగో [ఒక ఇటిక లాల్చీలోంచితీసి బల్లమీద పెడతాడు]

గాః- భేష్. పాట్లాబంగారం. ఎంత కావాలన్నారు.

సేః- రెండువేల రూపాయలు.

గాః- పోనీ తర్వాత చూసుకుందాం. మరో రెండువేలు పుచ్చుకోకూడదూ?

సేః- ఎందుకూ? మనకీ కాదు. మనభాయీదిసరుకు. మీకు మాకూ పైౖతే కాతా - రెండువేలు చాలు,

గో:- ఇవిగో రెండువేలు. [అక్కడవున్నకట్టతీసి చేతులో పెడతాడు]

సే:- [అందుకొని నోట్లు కొన్నిచూచి] అచ్ఛా! అసలు పైకం.

గో:- ఛా! ఛా! నకిలీ ఏమిటి! అదెలాటిదో మాకు తెలీదు.

సే:- అదికాదు భాయి. అసలుపైకంఅంతా యిచ్చేశావే అని అన్నానూ భాయి

గో:- అనుమానమా? అయితే లెక్క పెట్టుకోండి.

సే:- లెఖ్ఖ యెందుకూ భాయి? జైగోపాల్!

గో:- జైగోపాల్ — (సేటు తలూపుతూ వెళ్ళిపోతాడు. అప్పన్న తొందరగా వచ్చి)

అ:- బాబూ! ఆనోట్లకట్ట...

గో:- నకిలీకట్ట. అందులోనూ 15 వందలే ఉన్నాయి. గొడ్డు గోతిలో పడింది.

అ:- అమ్మయ్య! అసలే డబ్బులేక యిబ్బంది పడుతున్నాం. ఆ ఉన్నడబ్బుకాస్తా ఇచ్చేశారేమో అని బెంగ పడ్డాను.

గో:- అంత అమాయకుణ్ణి అనుకున్నావా? అప్పన్నా! ఇలాంటి సేట్జీలను వందమందిని అమ్మేస్తాను. [బంగారం ఇటికను తిప్పుతూ] బంగారం. పట్టినదల్లా బంగారం... అహ్హహ్హా! నాచెయ్యి పరసువేది అప్పన్నా!

అ:- బాబూ! కాలంకలసివచ్చినంతసేపూ అంతా అలాగే ఉంటారు. కాని కాలం ఎదురుతిరిగితే పచ్చిబంగారంకూడా మన్నవుతుంది.

గౌ:- నిజమే నువ్వు చెప్పినది. నేనూ అలాగే అనుకున్నాను, కాని డబ్బంటే వాటిలను వెనక్కు నడిపించగలం. కృత్రిమవర్షాన్ని కురిపించినట్లుగా, కృత్రిమ గాలిని సృష్టించినట్లూ, కృత్రిమ పిండోత్పత్తిని చేయించినట్లూ కృత్రిమకాలాన్ని సృష్టిస్తుంది. డబ్బుకి కాలంకూడా లొంగుతుంది. వాడు దొంగతనంగా బంగారం తెస్తున్నాడు. నేను దొంగతనంగా డబ్బును తయారుచేస్తున్నాను. వాడికి డబ్బు కావాలి. నాకు బంగారం కావాలి. ఈ మారకంలో వాడు ఫకీర్, మనం అమీర్!

అ:- ఏమో! అది బంగారం అవునో? కాదో?

గౌ:- చిట్టచివరకి కొనుక్కున్నవాడిది కర్మ. మధ్యవాళ్ళం మన కేమిటి?

అ.- బాబూ! అమ్మగారు తెలివిలేకుండా పడున్నారు.

గౌ:- అలాగా! అయితే ఒక్కసారి చూచిరావాలి. [ముందు గౌరీపతి వెనుక అప్పన్న మేడమీదకు వెళ్తారు]
[ముందు రాం, వెనక సోం, మధ్య శిశిర్‌కుమార్ వీధిలోంచి వస్తారు]

సోం:- రావోయి! రావోయి! భల్లూకరాజా!

రాం:- రాజ్యమేలేవోయి! భల్లూకరాజా!

శిశి:- ఉస్! ఆపండోయ్ మీ గానామృతం. [అంతా కలచి చూసి] డార్లింగ్ మై డార్లింగ్! నేను నీ స్వప్న

ప్రేమికుణ్ని వచ్చాను. ఈ యమకింకరులు నన్ను తినేస్తున్నారు. కమ్ ఆన్ మై స్వీట్ హార్ట్!

సోం:- మేము యమకింకరులమా?

రాం:- ఓరీ! ప్రాణీ! మమ్మే అవమానిస్తావటరా!

శిశి:- ఓ జీవులారా! సావిత్రి మున్ను యముని తనపతిప్రాణములను దయాభిక్ష గైకొనునట్లు మిమ్మే వేడుకొందును ఏదీ నాశోభ, మై స్వీట్ హార్ట్!

సోం:- ఆహా! అభినవ సావిత్రీ!

రాం:- సావిత్రీ! యీ దుర్గమారణ్యముల నధిగమించి నీవు రాజాలవు. చూడు మదే వైతరణీనది.

రాం:-సోం:- గల గల గల గల [నోటితో అంటారు]

శిశి:- ఆహా! మీరెద్దరూ చాకన్నా బాగా నటించగలరే!

సోం:- ఓయీ! అర్భకా! మేము నటులము కామని యెరుగుమా!

రాం:- జై! సోమ్ నాథ్! డింభకుణ్ణి కరుణించుము.

శిశి.- సోమనాథ్! ప్రశాంత పవిత్ర ఆలయ ప్రాంగణము! ఆ ప్రాంగణములోని జీవము లేని గరుడస్థంభము! కటాక్షించి నా శోభను చూపుము.

సోం:- రఘురామా! కరుణింతము ఈ అహల్యను.

రాం:- ఆర్యపుత్రా! అట్లే యగుగాక!

శిశి:- అమ్మా! కరుణించారా! ఓ 4 అడుగుల రెండు జానల మనుష్యుల్లారా! రామలక్ష్మణుల్లారా! ఈ దీనుణ్ణి, ఈ భక్త రామదాసును కరుణించారా!

సోం:- వీడు చాలా గట్టి పిండంరో!

రాం:- కాకపోతే మన గురువుచేతిలో పడతాడా!

శిశి:- గురువా! మీా గురునా?

సోం:- అఁ! అణిమాద్యష్టసిద్ధుడు.

రాం.- ఆగమవేదవేద్యుడు.

శిశి:- ఆహాహా! మహానుభావా! ఈ భవనంలో, ఈసోఫాలలో, ఈ ఎలక్ట్రిక్ దీపాలలో, ఈ సిగరెట్టు పీకలలో, ఈ టీకప్పులలో ఇక్కడున్నావా? జానెడు గోచీ, పీచుగడ్డం, ఒంటినిండా విభూతి, మహాబోధినీడ. ఆహ్యాము వచ్చారయా లేక యీా యింట్లోవుండే చిలకకు అద్వైతబోధ చేస్తున్నావా. అతీతం! నీ శక్తి అతీతం! నీయిచ్ఛ అనిర్వచనీయం. జై గురుబ్రహ్మ గురుర్విష్ణు! గురుదేవోనమోనమః (అంటూ నమస్కరిస్తూ తలవంచుతాడు మెట్లు దిగుతూ)

గా:- వీడేనా ఆ ఫోర్ ట్వెంటీ?

శిశి:- ఆ! ఏమి టీ నిష్ఠురోక్తులు. గురుదేవా యివి నీ మృదుమధురవాక్కులేనా?

గా:- స్కౌండ్రల్! నువ్వేనా ఆ దగాకోరువు (పీక పట్టుకుంటాడు.)

సోం:- గురూ. అర్భకుడు.

రా:- శాంతం! భోషాణం.

గా:- (ఒక్కతోపు తోస్తాడు)

శిశి:- (తూలిపడబోయి నిలతొక్కుకుంటూ) బార్బారస్! అసహజం! ఇదేనా తగుమనిషి తరహా!

సో:- తప్పు, నిష్ఠురో క్తులాడకూడదు కుర్రా,

రాం:- గురుదేవుని కాగ్రహము వచ్చును.

గా:- దశాకోరులకు మర్యాద కూడానా! ను వ్వెవడివి!

శశి:- అలా దాకి రండి! తాపీమీద మిమ్మల్ని మీరు, నన్ను నేను పరిచయం చేసుకుందాం. ఉభయకుశలోపరి చేసి చాయంగలవిన్నపములయిన తర్వాత అసలు ఇష్యూస్ సెటల్ చేసుకుందాం

సో:- ఆహా! ఉత్తరం వ్రాస్తున్నావా?

రాం:- ప్రేమలేఖలు రా!

శశి:- ప్రేమలేఖలు నేనే వ్రాశాను.

సో:- రాజకపూర్ ఫిల్ము నువ్వేనా వ్రాశావు?

రాం:- ఆరుద్ర అని తెరమీద చూచానే—?

శశి:- ప్రేయసికి వ్రాశాను, ఫిల్ములకి కాదు జాంజిబారులో నుండి అరటావు వ్రాశాను! సురబాయాలోనుండి అరటావు వ్రాశాను, రబాయోడి జెనిరోలోనుండి రెండుటావులు వ్రాశాను.

సో:- ఒక్క వుత్తరానికేనా జవాబు వచ్చిందా?

రాం:- ఆ వుత్తరాలు పోస్టు చేస్తేగా?

శశి:- నిజం; అవి నా 'పోస్టుచెయ్యని' వుత్తరాలు.

గా:- ఏమిటీ! పోసుచెయ్యని వుత్తరాలు నీవా వ్రాసింది?

శశి:- కాదు. అతను నా సోదరుడు. ఎవరైతేనేం! మేం కవులం, అంతా అవిభాజ్య కుటుంబం, వసుధైక కుటుంబం. నీవూ నేను అనే భేదం లేదు వాడు వ్రాసిందే

నేనూ వ్రాశాను, నేను వ్రాసిందే వాడూ వ్రాశాడు, వ్రాసిందే వ్రాశాము, పాడిందే పాడాం.

సో౦:- పాసిపళ్ళ దాసరీ!

రాం:- సాటిలేరు సీసరీ!

శిశి:- ఎక్సలెంట్! ఒన్సుమోర్! అనుప్రాస. అదే హిందీ కవిత్వానికి లక్షణం. ఇప్పుడిప్పుడు మేం ప్రవేశపెడ్తున్నాం! అందొక నవ్యకవితా విప్లవం! మేమంతా ఆ విప్లవాగ్నిలో సమిధలం!

నేను సహితం - ప్రపంచాగ్నికి!

సమిధనొత్తూ - ఆహుతిస్తా!!

గో:- అసలు నువ్వెవరు? కవివేనా?

శిశి:- "ప్రతివాడును కవియేసుమా" జనమంచివారి సూక్తి "గుండె గొంతుకలోకి కొట్లాడుతాది" నండూరివారి వుబలాటం. "పలికింది నాలోన ప్రణయవల్లకి తంత్రి" స్వామీ శివశంకరుల సంకల్పం. వీరంతా నా కవి మిత్రులు, అందుచేత నేనూ కవినే, యువకవిని, మహా కవిని, శిశిర్ కుమార్!

గో:- నువ్వేనా, యిదివరకు యిక్కడకు వచ్చింది?

శిశి:- అవును, నేనే శోభాకరకంకణకింకిణీనిక్వాణంలో నర్తించింది.

గో:- నోర్ముయ్!

సో౦:- సమాసం వెలగబెడుతున్నాడురా!

రాం:- ఎందరి దీపాలు ఆర్పాడో! ఆపాటి రాదా?

(శఠగోపం వస్తాడు)

శ:- ఇతనే! నే నిక్కడ చూచినది.

గౌ:- అయితే నీ శోభను చూస్తావా?

శిశి:- ఓ; యస్.

గౌ:- శోభా! శోభా! శిశిర్ కుమార్ వచ్చాడు.

శిశి:- అలా కాదు, పిలవడం.

దిగిరావె—దిగిరావె
దివినుండి భువికి
దివ్యమంగళమూర్తి
ధీధితులు నింప
ఓ! చెలీ! ఓ! సఖీ!
నా ప్రణయ-చాతకీ!

శోభ:- [ఆత్రుతగా] స్వామీ! వచ్చారా?

గౌ:- [శిశిర్ వైపు వెళ్తోన్నదాన్ని ఆపి] వీడినేనా శిశిర్ కుమార్ అంటున్నావు?

శోభ:- ఆపకు, గౌరీపతీ!

శిశి:- గౌరీపతీ! ఓ సీతాపతీ! మా మధ్య ఏమిటి నీఆటంకం?

గౌ:- షటప్! వాగుడు పెంచుతున్నావు. నీవు వధ్యశిలమీద ఉన్నావని గమనించకుండా వున్నావు.

శిశి:- గమనించలేదు. గమనించినా విచారపడను. ప్రతి ప్రేమికుడూ ప్రణయినికోసం వధ్యశిలమీద తల వుంచటం, అంతటివరకూ నీలాటివిలన్ బ్రతికుండడం, హటాత్తుగా విలన్ చచ్చి పేమీ ప్రేమికులు పరిణయ

మూడాక కథముగియుకం కుసు కలవాయి. అంచ
చేత నేను బేఫికర్‌గా ఉన్నాను.

గా:- వట్టి సినిమారాయుడిలా ఉన్నారు.

శిశి:- నిజం, ప్రబంధరాయుణ్ణిమాత్రం కాను.

గా:- శోభా [శిశిని చూపిస్తూ] నీ కెవ రంటావు?

శో:- శిశిర్ హసూన్ ...!

గా:- నీ పే రేం పేరు?

శిశి:- శిశిర్ కుమార్.

గా:- శోభా! శిశిర్ కుమార్ గేయాలే పత్రికల్లో చదివావు

శో:- "బాకా"లో.

గా:- మిస్టర్ శిశిర్ కుమార్! మీ గేయాల నేయే పత్రికల్లో
పబ్లిష్ చేశారు?

శిశి:- "బాకా" పత్రికలో...

గా:- ఆ పత్రిక సంపాదకుణ్ణి మీ రెరుగుదురా?

శిశి:- ఓ! ఆయన నా కనేకసార్లు చెక్కు లిచ్చాడు. ఒకసారి
నాకు సన్మానంకూడా చేస్తానన్నాడు. నేనే యింకా
నాకంటె పెద్ద లున్నారని వద్దన్నాను.

శ:- ఓ! అలాగా! ఆయ నిక్కడున్నాడో లేదో చెప్ప
గలవా?

శిశి:- నే నేం కోర్టులో సాక్షినా?

గా:- ఆయ న్నెరుగవా?

శిశి:- ఎందు కెరుగనూ?

శో:- శతగోపా న్నెరుగవా! డార్లింగ్!

గా:- ! డార్లింగ్ దగా కోరు వలలో పడి ఒళ్ళు తెలీకుండా వుంది.

శిశి:- ఔనౌను. శఠగోపం! [సోంని చూపిస్తూ] నీవేనా శఠగోపం!

శో:- నీ తలకాయ.

శిశి:- [రాంని చూపిస్తూ] నీవా శఠగోపం!

రా:- [సోంని చూపిస్తూ] వాడే! అబద్ధ మాడుతున్నాడు.

శిశి:- [సోం తో] నువ్వేనా!

సో:- ఊహూ. వాడు.

శిశి:- [రాంతో] నువ్వేనా!

రాం:- ఊహూ. వాడే.

శిశి:- చెప్పండి. మీలో ఎవరు శఠగోపం. నన్ను బాధ పెట్టకండి.

శ:- అయితే శఠగోపాన్ని నువ్వెరుగవని ఒప్పుకో!

శిశి:- చూడండి! సంపాదకులతో మాకేమి పని చెప్పండి. ఈ రచలు పోస్టులోనే పంపుతాం. చెక్కులు పోస్టులోనే వస్తాయి.

గా:- మ రిందాక ఏ మని కూ శావు!

శిశి:- ఒక అపస్వరం కూశాను. మధురమణి అయ్యరుకే అపస్వరాలు వస్తాయట!

గా:- షటప్! పెద్దవాళ్ళగురించి పేలుతున్నావు! నీ పేరే మిటి చెప్పు!

సోం:- ఏం, శిశిర్‌కుమార్ కాదా?

శిశి:- ప్రియే! అదే...

గో:- [పిస్తోలు గురిపెట్టి] చెప్పు, నీ నిజంపేరు చెప్పు. లేక పోతే కాల్చేస్తాను.

శిశి:- [వణుకుతూ] ఉండండి సార్! మారణాయుధాలు హింసను ప్రేరేపిస్తాయి.

గో:- నీలాంటి ఇంపోస్టర్‌ని మారణాయుధాలతోనే బట్ట బయలు చేయాలి.

శిశి:- చెప్పక తప్పదూ—!

శోభ:- నీచుడా! నన్ను నమ్మించావు [ఏడుస్తూ] అంతా నన్ను మోసం చేస్తున్నారు. అంతే! నన్నే ఏడిపిస్తున్నారు. అంతా పనిపట్టి నామీద కత్తికట్టారు. [పోబోతుంది]

గో:- ఉండు శోభా! ప్రపంచంలో ఒకవైపే నీకు తెలుసును. అది బొమ్మ - ఇది రెండో ప్రక్క—బొరుసు. నువ్వు శిశిర్‌కుమార్ వేనా?

శి:- చెప్పు! దగుల్బాజీ! ఒక అమాయికస్త్రీని నీ దాసు రాలిగా చేసుకోవాలని పన్నాగం పన్నావు.

గో: ఊం! ఒకటి, రెండూ, చెప్పు. లేకుంటే కాల్చేస్తాను.

శిశి:- పరాంకుశం!

గో:- ఆ గేయాలు నువ్వు రాసినవేనా?

శిశి:- కాదు.

శ:- ఇందాకటి మన అనుమానం మరచిపోయావా?

గో:- వీడు వట్టిఅసమర్థుడు. ప్రపంచంలో ఇంకొకలా జీవించలేక ఒక స్త్రీలో ఉన్న బలహీనతపై బ్రతకడాని కాశించాడు. వీడు డిటెక్టివూ కాదు, పాడూ కాదు.

సో:- పరాంకుశం!

రాం:- కళ్యాణమస్తు!

శో:- ఇలా తే! ఆ పిస్తోలు నిలా ఇయ్యి! ఈ దగాకోరును నా చేతులతో నేను కాల్చేస్తాను. నా హృదయాన్ని గాయపర్చిన ఈ చండాలుడు నా యెదుట ఒంటి నిండా గాయాలతో చావాలి.

గో:- ఆవేశపడకు! శోభా! పరిస్థితి చెయ్యిదాటిపోకముందే మేల్కొన్నావు. [నవ్వుతూ] హల్లో మిష్టర్ శిశిర్ కుమార్! నీకు బ్రతకాలనివుందా? చావాలనివుందా?

శ:- ఇలాంటివాళ్ళను ప్రాణాలతో వదిలిపెడితే, ఈ సంఘ టనకు చిలవలూపలవలూఅల్లి దుష్ప్రచారంచేస్తారు!

గో:- ఆవేశపడకు, శఠగోపం. మనం హంతకులం కూడా కాలేం. మనలోవున్న మానవత్వాన్ని మరచి పోవద్దు.

శ:- అదుగో నీలో శిశిర్‌కుమార్ మాట్లాడుతున్నాడు.

శో:- శఠగోపం! నువ్వుకూడా నన్ను బాధిస్తున్నావా?

శ:- లేదు శోభా! ఇదిగో ఈ ఉత్తరాలు, ఈ అచ్చు పేపర్లు. నిన్ను నమ్మించడానికి పట్టుకొని వచ్చాను.

శో:- [అన్నీ పరిశీలించి] గౌరీ! నేను పాపిని ఆనాడు నమ్మ లేదు. ఈనాడు నమ్ముతున్నాను. నన్ను క్షమించు.

గౌ:- నన్నే నువ్వు క్షమించు. నాలోని బలహీనతే నీకు నన్ను దూరం చేసింది. మనమధ్య చెలరేగుతున్న తుఫా నిప్పుడు తెరపిచ్చింది. మిష్టర్ శశికుమార్...!

శో:- గౌరీ! ఆపేరుపెట్టి ఆ దగాకోరుని పిలవకు.

శశి:- నన్ను క్షమించండి. అసమర్థుణ్నయ్యేను. డబ్బు కాసిం చేను. సులభంగా డబ్బు అనుభవించడంకోసం ఈ ఎత్తు ఎత్తేను. చుక్కెదురైంది నన్ను వదలిపెట్టండి. నేను బుద్ధిగా పోతాను. [లెంపలేసుకుంటాడు]

అ:- [వస్తూ] వదలకండి బాబూ! ఒకబోగం స్త్రీ ఇంటో కుళ్ళిన శవం దొరికింది. ఆ హత్యా కితందే బాధ్య తేమో! పోలీసుల కప్పగించండి.

శశి:- క్షమించండి. దగానేరం చేసినవాడే హత్యచేసి వుంటాడని అనుకోవటం పొరపాటు. నేను హంత కుణ్ణిమట్టుకి కాను. కష్టపడకుండా సులభంగా విలా సంగా, చలాకీగా కాలక్షేపంచేయాలని ఇలా ప్రవ ర్తించేను. ధనవ్యామోహంతో కొత్తదారి తొక్కా లనీ, డబ్బుతో లోకాన్ని వంచించాలనీ ఈవిధంగా వచ్చేను. ఈ ధనానికి విలువలేదని గ్రహించేను. నైసర్గికజీవితంలో వున్న మాధుర్యానికి దూర మయ్యాను నాకూ భార్యా పిల్లలూ వున్నారు. నా

గూటికి నేను చేరుకుంటాను. నన్ను వెళ్ళనీయండి. [నోట్లు పెట్టి వెళ్ళిపోతుంటాడు]

గౌ:- పరాంకుశం! ఇలా రా! నీ భార్యాపిల్లలకు ఈ డబ్బివ్వు. నీ పిల్లలకు శోభాదేవి కానుకగా దుస్తులు కొనియ్యి. తీసుకువెళ్ళు. ఏం శోభా!

శో:- నన్ను మాట్లాడించకు. నా మనస్సు వికలమై, నీరవ మవుతోంది. నీ యిష్టమే కానీ.

గౌ:- [శిశిర్ వైపు తిరిగి] ఊ! తీసుకో!

శిశిర్:- [సంకోచిస్తూ తీసికొని "సెలవు" అంటూ తొందరగా వెళ్ళిపోతాడు]

శ:- అబ్బ! పద్మవ్యూహాన్ని చివరకు ఛేదించాం!

గౌ:- వ్యూహాలన్నీ ఒక్కటొక్కటే ఛేదించుకుపోతాయి— ఒక దొంగ దొరికాడు. అలాగే మిగతా దొంగలు కూడ దొరికిపోతారు. పొద్దుగ్రుంకితే ప్రమాదం వస్తుంది.

ఏం! శోభా! ఇప్పుడేనా అంగీకరిస్తావా—మనం క్రొత్త జీవితం ప్రారంభించటానికి?

శో:- గౌరీ! ఈ వాతావరణంలో మరి ఉండవద్దు. పోదాం, కొత్త ప్రదేశానికి పోదాం. ఈ దొంగతనం, డాబు దర్పమూ, కృతకమూ అయిన జీవితం మనం గడప వద్దు. సుఖజీవితాన్ని చవిచూద్దాం!

గౌ:- ఈనాటా! ఏనాటో నేను విసుగుచెందాను.....
శరగోపం! [క్షోభ పోతుంది

శ:- ఇదేమి టీ విచిత్రం?

గౌ:- శరగోపం......మన ఈ జీవిత అధ్యాయాన్ని ఇ
టితో ముగించి వారొక కొత్తబాటను తొక్కుదా
[డ్రాయరు తీసి] ఇదిగో! నాతోనేఉండి, నా నీడ
లో పాప పుణ్య విచక్షణాలు లేని, పాలు పంచు
నాతోపాటు నశించిపోయిన ఆప్తమిత్రుడివి......
ఈ 50 వేలు అసలు నోట్లను నువ్వు తీసుకో. ఎక్క
డికైనా పారిపో. న్యాయంగా జీవించు.
(అప్పన్న త్వరగా పోతూఉంటాడు)

గౌ:- అప్పన్నా! ఏం అంత త్వరగా పోతున్నావు! ఉండు

అ:- బాబూ! ఉండను. బాబూ! ఈలా మీరు చెట్టుకి
పిట్టగా అయిపోవడం చూడలేను పోతాను ఆత్మ
హత్య చేసుకుంటాను.

శో:- ఆగవోయి! అప్పన్నా!

రాం:- ఆగు, మిత్రమా!

గౌ:- ఆపకండి! ఆత్మహత్యకంటె పశ్చాత్తాపం మరొక
లేదు. వాడిఆత్మ అలాగే శాంతిస్తుంది.
[అప్పన్న నిష్క్రమిస్తాడు]

శ:- సెలవు! గౌరీపతీ! మధ్యలో కలిశాం. లేమిలో కలి
శాం! కలిమిలో విడిపోతున్నాం! సెలవు.......
[పోతాడు.]

ఒకే సోం! రాం! తీసుకోండి. మీ రీ శేరి పదివేలూ తీసుకోండి. ఉన్నన్నాళ్ళూ ఒక్కకన్నా విశ్వాసంగా పనిచేశారు ఇదీ అసలు శబ్బ! ఏ వ్యాపారమో పెట్టుకొని జీవించండి. వ్యాపారంలో ప్రజలనమ్మకాన్ని, అమాయకత్వాన్ని ఆసరాచేసుకుని వారిని మోసగించి అధికలాభాలకోసం ప్రాకులాడకండి. ఇక్కడ కాక పోయినా అక్కడేనా భగవంతుడు మిమ్మల్ని క్షమించడు.

o:– గురూ.....! వెళ్ళాలని లేదు.

o:– కాళ్ళు రాకుండా వున్నాయి.

:– కష్టంగానే వుంటుంది. కానీ తప్పదు.

o రాం:– గురూ.....! సెలవు. [పోతారు]

:– ఇక్కడితో చుట్టూ ముాగిన పిశాచాలన్నీ విరగడైనాయి. ఇక కొంతడబ్బుతో శోభా నేనూ యీ యింట్లోనుంచి బయటపడాలి! డబ్బు కావాలి. అధమం ఒకలక్షరూపాయలేనా ఉంటేనేగాని కొంతకాలంపాటు వెళ్ళదు. దీనికల్లా ఒక్కటే ఉపాయం...[ఫోనుతీసి] హాల్లో...హాల్లో...చిరంజీలాల్ జాంజాంవాలా...ఆఁ! సేట్ చిరంజీలాల్ కావాలి....హాల్లో...ఎవరూ సేట్జీ! ఆఁ! మాట్లాడుతున్నది, నేను గౌరీపతిని. [నవ్వి] జై గోపాల్! ఒక్కసారి మీరు దయచేస్తారా!... ఇప్పుడే! అర్జంటుగా మాట్లాడాలి...ఓ! ...వస్తా

న్నారా!...జై గోపాల్ [ఫోను పెట్టి] జై గోపాల్! అస్త మానం భగవన్నామం, అడుగడుక్కీ దొంగలాభా లున్నా. అంతా అర్జనే. అర్థణాడబ్బు లేనా ధర్మం చెయ్యాడు. ఈ దెబ్బతో వీడపని అయిపోతుంది. [కారు ఆగిన చప్పుడు]

సే:- జై మదనగోపాల్!

గో:- దయచెయ్యండి...దయచేయండి.

సే:- హెమిటీ జరూరుగా ఖబర్ చేశార్.

గో:- అలాగే! ఈసమయంలో మీరుతప్ప నాకు సాయపడే వా ళ్ళెవరూ లేరు.

సే:- అరె ఆప్కీ తకిలీబ్...ఆప్కా సోమనాథ్, రాం చంద్, అప్పన్నా......

గో:- అంతా వెళ్ళిపోయేరు. సిరిఅంటే కోరుతారుకాని చెడు కోరుతారా! సేట్జీ! అంతా యీ ఆపదసమయం లో నన్ను విడిచి నాతో దెబ్బలాడి వెళ్ళిపోయారు.

సే:- నౌఖరు, అప్పన్న!

గో:- వాడు నాకొచ్చిన అపదకు తట్టుకోలేక గుండెలు పగిలి నూతిలో ఉరికి ఆత్మహత్య చేసుకున్నాడు,

సే:- బడా అచ్ఛానౌఖర్ ... పాపం... ఘోరం చెప్తు న్నారే ...

గో:- ఒక్కొక్కప్పుడు ఘోరాలు మన కళ్ళముందే జరుగు తాయి. నా కొక గొప్ప ఆపద వచ్చింది.

సే:- ఏమిటదీ!

గా:- మీకు తెలియదు కాబ! నా భార్య శోభ......

సే:- అచ్ఛా! హెక్డా హువున్నార్—?

గా:- ప్రస్తుతం పూనా శానిటోరియంలో క్షయ వ్యాధి చికిత్సలో వుంది.

సే:- పాపం...! ఇంత చిన్న వయస్సులో క్షయవ్యాధీ- రాధాకిషన్, రాధాకిషన్!

గా:- అంతటితో ఆగితే సరిపోను.

సే:- పాపం! తఖలీబ్ తకిదీర్ కా జుమేదార్ నహీ......

గా:- ఆమె వ్యాధి ముదిరింది. వియన్నా హాస్పిటల్‌కు మార్చమని, తక్షణం 24 గంటలలో మార్చకపోతే ప్రాణభయం కలుగుతుందని, డాక్టరు టెలిగ్రాం యిచ్చాడు.

సే:- మార్చండీ...తచ్చసం మార్చండి.

గా:- ఎలా! సేట్జీ...వియన్నా తీసుకొనిపోవడమంటే...అధమం లక్షరూపాయిలేనా లేకపోతే ఎలా!......ఈ ఆపదసమయంలో మీరుతప్ప ఎవరు ఆదుకోగలరు!

సే:- లక్ష రూపాయల్! చికు హోచిందే...

గా:- మీరు సందేహించకండి...ఈ మేడమీద నాకు లక్ష రూపాయ లివ్వండి.

సే:- ఈ మేడమీద లక్షరూపాయిల్ పైసా...కిమ్మత్ నహీ?

గౌ:- [నవ్వి] ఈ మేడ యింతే అనుకుంటున్నారు. ఇది వట్టిమేడమాత్రం కాదు. ఈమేడపెరట్లో బంగారం నిధు లున్నాయి. డబ్బులు పండే చెట్లున్నాయి.

సే:- ఆ! క్యాజీ! డబ్బులు పండే చెట్లూ!

గౌ:- రోజు రోజుకీ వేలకు వేలు పండించే నిక్షిప్తంవుంది. ఈ సంగతి కోటిన్నర రూపాయిలు దిగమింగే ప్రభుత్వ పోలీసులకుకూడా తెలీదు. ఈ నిక్షిప్తాన్ని తమ పరం చేసుకొనడానికి ప్రభుత్వం శతథా ప్రయత్నించి విఫలమైంది. మేడంటే వట్టి మే డనుకున్నారా?

సే:- మేడా పెరట్లో వుందీ నిక్షిప్తం—బోధపడలేదు.

గౌ:- సేట్జీ! మిమ్మల్ని నమ్మాను. ఇంతవరకూ ఈశ్వరుడికేనా యీ రహస్యం తెలియలేదు.

సే:- అంటే...?

గౌ:- [చెవిలో] నోట్లు తయారుచేసే యంత్రం.

సే:- ఆ! జై మదనగోపాల్! నిజంగానా గౌరీపతీజీ!

గౌ:- అనుమానిస్తున్నారా?

సే:- లేదు. కాని, నగదు తేలేదు.

గౌ:- లక్షరూపాయ లివ్వండి! ఈ మేడతోసహా ఆ లక్ష్మీపీఠాన్ని మీ కప్పగించి వెళ్తాను. మళ్ళీ రోజులు బాగుంటే మీడబ్బు మీ కిచ్చి నామేడను నేను తీసుకొంటాను.

సే:- హాః అట్లాగే. దోస్తీమే నమ్మకహరాం వుండదు. చిరంజీలాల్ అచ్ఛాహై!

గౌ:- అయితే, సేట్జీ! డబ్బు తీసుకోకండి. వెళ్ళండి. త్వరగా వెళ్ళండి. 4 గంటలకే ఎయిరోడ్రోం చేరుకోవాలి. త్వరగా వెళ్ళండి!

సే:- వెళ్తున్నాను. 5 నిమిషాల్లో తిరిగివస్తాను.

గౌ:- సేట్జీ! ఈవార్త యెవ్వరితోనూ చెప్పరుగదా!

సే:- అరె పిచ్చి హై క్యా! లక్ష్మీకిబాత్ చెప్తానా! నాకూ లక్ష్మీ అక్కరలేదు! రోజురోజుకూ వేలకువేలు— బిర్లా, డాల్మియా సే బడా సేట్ చిరంజీలాల్ జుం జుంవాలా.

గౌ:- జియో! జితే రహో! చిరంజీలాల్ జుంజుంవాలా!

సే:- జై గోపాల్ [చరచరా వెళ్తాడు]

(నిశ్శబ్దం......గౌరీపతి లెదర్ సూట్ కేస్‌లో బట్టలు సర్దుతాడు. పిస్తోలుతీసి జేబులో పెడతాడు.)

గౌ:- శోభా! శోభా! [శోభ వస్తుంది.]

గౌ:- పడింది. పిట వలలోపడింది.

శో:- ఏమిటి గౌరీ, నీప్లాను నా కేమీ అర్థంకాలేదు.

గౌ:- ఈ మేడ, యీయంత్రాన్ని సేట్ చిరంజీలాల్‌కు ఒక లక్షరూపాల కమ్మేశాను. డబ్బంటే గడ్డేనా కరుస్తాడు, పత్నిగాడు. డబ్బుపట్టుకు రావడానికి వెళ్ళాడు. ఇంకొక గంటలో మనం విమానంలో నీలిమేఘాలలో తేలిపోదాం.

జలదారుల పల్లకిలో
జలతారు దారిలో
కదలవే కదలవే
ఓ నా సఖి! ఓ నా చెలీ!

శో:- ఆహా! గౌరీ! నువ్వు నీతిమార్గంలో నడవాలి. నీ క్రొత్త జీవితానికి ప్రజలు నీవాళులెత్తాలి. నేను చూసి మురిసి పోవాలి.

గౌ:- దేశసేవ చేస్తాను. అన్యాయాన్నీ, అధర్మాన్నీ ఎదిరిస్తాను! మోసాన్నీ, పీడనూ నిరసిస్తాను. ప్రజలకూ, ప్రజానాయకులకూ దారి చూపిస్తాను. మానవత్వంలో విలువలకు మచ్చుగా నిలిచిపోతాను.

(అప్పుడప్పుడు చప్పుడౌతూ యుంటుంది)

శో:- ఏదో చప్పుడు వినిపిస్తోంది.

గౌ:- నిర్జనమైన ఈ మేడలో వంటరిగా వుండడం అలవాటు లేక అలా భయపడుతున్నావు. నీమనస్సే నీకు భయం కలిగిస్తోంది. [కారాగిన చప్పుడు] అదిగో, సేట్ వచ్చినట్లున్నాడు. వెళ్ళు. మేడమీద తలుపులు వేసుకో. సమయంచూచి ఈలవేస్తాను పెరటిదారిని వీధిలోకి వచ్చేయి. వీధి చివర కలుసుకొని వెళ్ళిపోదాం.

శో:- [మెల్లిగా వెళ్ళిపోతుంది. మరొకకారాగినచప్పుడు]

గౌ:- [పరుగెత్తి వీధివైపుకు వెళ్ళి] జైగోపాల్! మీరేనా! ఏమిటిచెప్మా చప్పుడని చూచాను.

సే:- ఏమీ లేదు. ఒకలారీ మా కారును ఓవర్ టేక్ చేసింది,

గా:- సేట్జీ! తెచ్చారా! డబ్బు...

సే:- తెచ్చాను. జాగ్రత్తగా తెచ్చాను. పదభాయ్ యింతకీ సూచివద్దా!

గా:- అలా కాదు! ముందు డబ్బియ్ సేట్జీ!

సే:- ఏం! నమ్మకం నహీం! అయితే నాకూ అక్కరలేదు...

గా:- అదికాదు సేట్జీ! డబ్బు చూపించండి. మిమను చూపిస్తాను.

సే:- ఇదిగో డబ్బు [నోట్లకట్ట చూపిస్తాడు]

గా:- [గబుక్కున తీసుకొని] పదండి—పెరట్లోకి వెళ్దాం పదండి. [పెద్ద ఈలవేస్తాడు. సేటుతో పెరట్లోకి వెళతాడు. కొంచెంసేపు పోయాక బర్స్టు అయిపోయి. వగర్చుకుంటూ] పోలీసులు! పెరట్లో పోలీసులు! ఇంటిచుట్టూ పోలీసులు! పథకం అంతా తలక్రిందులైంది

సేట్జీ! ఇద్దరం చెడిపోయాం.
[సేట్జీ నవ్వుతూ వుంటాడు] నవ్వుతున్నావా సేట్జీ! మృత్యుముఖంలో ఇరుక్కున్న ఈసమయంలో నీకు నవ్వొస్తోంది. సేట్జీ! నిజంచెప్పు. ఈ పోలీసు లెలా వచ్చారు? ఎవరునువ్వు? ఎవరు నువ్వు? చెప్పు [పిస్తోలు తీసి] కాల్చేస్తాను.

సే:- జై! మదనగోపాల్!

గౌ:- అతివాగుడు ఆపు. నువ్వు సేఠ్జీవి కావు. ఇదంతా ప్లే...ఎవరు నువ్వు? [పాగాతీసేస్తాడు]ఆ, సేఠ్జీవికావు! కాల్చేస్తాను, నిజం చెప్పు:

సే.- [లాల్చీ విప్పి...పోలీసు దుస్తులతో నిలబడిపోతాడు.]

గౌ:- ఇన్‌స్పెక్టరు.

సే:- ఇన్‌స్పెక్టరు, సుధాకర్, డిటెక్టివ్...

గౌ:- సుధాకర్! పులితో చెలగాట లాడుతున్నావు రక్త పిపాసితో ఆటలాడుతున్నావు నీవు నీ పోలీసులు నన్నేం చేయలేరు. నిన్ను కాల్చేసి తప్పించుకుంటాను. గౌరీపతి దారిలో అడ్డువచ్చి ప్రాణాలతో పోయినవా డెవడూ లేడు. నీ నూరేళ్ళు నిండాయి. అధికార ముం దని మృత్యుగృహంలోకి వచ్చావు...రడీ [పిస్తోలు గురిపెడుతూ] "శోభా-శోభా!" [అని ఈల వేస్తాడు.]

సు:- వృథాప్రయత్నం చేస్తున్నావు. పంజరంలోపడ్డ చిలుక బయటకు రాలేదు. నీ శోభ మేడమీద లేదు ఈ పాటికి పోలీసు లామెను స్టేషనుకు తీసుకుపోతూ వుంటారు.

గౌ:- ఆఁ! శోభా! శోభా! [అంటూ మేడమీదకి వెళ్ళి చూచి] సుధాకర్! ఎంతపనిచేశావు? నాశోభని స్టేషనుకు పంపించావా? నాశోభను! నాజీవితశోభను

నాశనంచేశావు. పయోముఖవిషకుంభం! ఆప్త మిత్రుడుగా నటించావు నా శోభమీాదా నీ కన్ను! నా శోభ ప్రేమనుకు వెళ్ళేలోపలనే నీజీవాలను యమ లోకానికి పంపిస్తాను. నా శోభ కన్నీటికి నీభార్య కన్నీరు తోడవుతుంది. [పిస్తోలును పేలుస్తాడు. పేలదు.]

సు:- [నవ్వి] ఆ పిస్తోలు పేలదు.

గౌ:- [పిస్తోలు చూచి] ఇది నా పిస్తోలు కాదు.

సు:- అప్పన్న యిచ్చినదేకదూ!

గౌ:- ఆ! అప్పన్న యిచ్చినదే - అప్పన్నలోకూడా మో సం వుంది.

సు:- అప్పన్నకాదు, నా హెడ్ కానిస్టేబిలు అప్పారావు.

గౌ:- మోసం! అంతా మోసంచేశారు, మోసపోయాను. అందరూ నమ్మించారు, నమ్మాను. నమ్మించి మోసం చేశారు.

సు:- ఎవరు మోసంచేశారు? ఎవరు మోసగింపబడ్డారు. దొంగనోట్లు తయారుచేసి ప్రభుత్వాన్ని మోసం చేశావు. నీ నోట్లను తీసుకొని అమాయక ప్రజానీకం మోసపోయింది. సంఘాన్ని, సోదరజనాన్ని, ప్రభు త్వాన్ని నువ్వే మోసంచేశావు. చివరకు మోసం తోనే పట్టుబడ్డావు. వృథాప్రయత్నం చెయ్యకు. తప్పించుకొని పారిపోలేవు. [పిస్తోలు గురిపెడతాడు.]

గో:- అబద్ధం! నేను మోసం చెయ్యలేదు. నా జీవికకూ, నా ఆత్మానందానికీ, నేను ప్రయత్నానికీ నాకు తోచినదీ, చేతనైనదీ చేశాను. సంఘాన్ని నేను మోసం చెయ్యలేదు. ఆ సంఘం నన్ను మోసం చేసింది. చదువున్నా, సంస్కారమున్నా, సామర్థ్యమున్నా, సహృదయత ఉన్నా పేదవాణ్ణని, సంఘం నన్ను అసమర్థుణ్ణనీ కాస్తంత చోటివ్వకుండా కుక్కను తరిమినట్టు తరిమింది. నాకుండే సహృదయాన్ని, మానవత్వాన్ని, సంఘం పేదరికం కారణంగా ఆ సంఘస్థానంలోంచి అవతలకి నెట్టేసింది. ఆ జనం నన్ను నిరాదరించారు. ఒక్కరైనా సానుభూతి చూపించలేదు. మానవతకూ, సహృదయానికీ, కట్టుపడితే నాకు ఒక పూట తిండి దొరకలేదు. లేక సంఘాన్ని తృణీకరించాను. ఆ సంఘానికి డబ్బు తెలుసు పలుడి. డబ్బున్న వాడి వెనకాతల కుక్కలా తిరుగుతుంది, సంఘం ఆ సంఘంలోని జనమంతా. డబ్బును సృష్టించాను. సంఘం నాదగ్గర కొచ్చింది. నన్ను పూజించింది. నే నాడితే ఆడింది. నేను పాడితే పాడింది. నాకు నీజనంఅంతా బ్రహ్మరథం పట్టారు. నాకు సన్మాన పత్రాలు సమర్పించారు. నాచేత తనసంస్థలకు శంఖు స్థాపనలు, ప్రారంభోత్సవాలు చేయించుకున్నారు

నీ జనం. డేంట్లో ఉంది నీసంఘం, నీ జనం! డబ్బులో వున్నాయి. డబ్బుకి దాసోహమైంది. ఆ సంఘానికి దేవుడు డబ్బు. ఆ డబ్బుండగానే నేను వారికి దేవుణ్ణయ్యాను. అడుగు. ఆ సంఘాన్ని అడుగు. ఆజనాన్ని అడుగు. నేను మోసంచేశానా అని...

సు:- జనానికీ, సంఘానికీ అతీతమైంది ధర్మం, న్యాయం! ఇప్పుడు నువ్వు సమాధానం చెప్పవలసింది జనానికీ, సంఘానికీ కాదు; శిక్షాస్మృతికి—న్యాయం నీవు మోసగాడివనీ, నేరస్థుడవనీ తీర్పు చెపుతోంది.

గో:- న్యాయం! శిక్షాస్మృతి! నేరం! నీ న్యాయానికి కళ్ళు న్నాయా! గుడ్డిదై విన్నమాటలనుబట్టి తీర్పునిస్తుంది, నీ న్యాయం. సంఘంలోజరిగే అన్యాయాలను చూడలేదు నీ న్యాయం. నీలాంటి తాబేదార్లు చెప్పే మాటలు విని తీర్పుచెప్పుతుంది. కుల వివక్షతో వుద్యోగం దొరకక, కూడు దొరకక, అల్లాడిపోయే చదువుకున్న నిరుద్యోగికి ఏమిటి నీ న్యాయం యిచ్చే రక్షణ! భజనపరులతోటీ, బజంత్రీరాయుళ్ళతోటీ మందిబలం కూర్చుకొని ప్రజలఅమాయికత నాసరా చేసుకొని పెద్దపెద్ద పదవులలో కూర్చుని పెత్తనం చేసే వ్రేలుముద్రరాయుళ్ళపట్ల ఏమిటి తీర్పు

చెపుతుంది నీ న్యాయం. ముతకబట్టలు కట్టుకొని చందాలు వసూలుచేసి, సిమ్మెంటుమేడలు కడుతూ, కంట్రాక్టులు కమిటీ సభ్యత్వపు భత్యాలు కాజేస్తూ దేశసేవకులమని చలామణీ అయ్యే టోపీదాసులపట్ల ఏమిటి నీన్యాయం యిచ్చేతీర్పు? అమాయికులైన కూలీలను రెచ్చగొట్టి సమ్మె చేయించి యజమాని దగ్గర లంచందిగమ్రింగి, కార్మికులను గాలికి ధూళికీ వదిలిపెట్టే ఛోటాకార్మికులనాయకులపట్ల ఏమిటి నీ న్యాయంతీర్పు? అమాయికులైన రైతుల వ్రేలి ముద్రలు వేయించి అప్పులిస్తామని ప్రభుత్వధనాన్ని దళారీలద్వారా పంచుకుతినే లంచగొండి అధికారుల పట్ల ఏమి తీర్పిస్తుంది నీ న్యాయం? ఏం! మాట్లాడ వేం. ఈ అన్యాయాలను చూస్తోందా నీన్యాయం!

సు:- చూస్తోంది. నీలాగే వాళ్ళూ సంఘానికి చీడపురుగులు, వారికీ కాలం మూడినపుడు శిక్షిస్తుంది.

గో:- వాళ్ళంతా సంఘాన్నీ, జనాన్నీ మోసం చెయ్య లేదా?

సు.- అంతకంటె నువ్వే ఘోరమైన మోసాన్ని చేశావు. దొంగనోట్లను పెట్టి ప్రజల ఆర్థిక జీవితంలో చిచ్చు

పెట్టావు. డబ్బుకు దాసుడవై, వ్యక్తిపొగడ్తలకు జేసి,
జాతీయతను విస్మరించి, పత్రికావర్యాన్ని విస్మరించి
చెడును మంచిగా రూపొందించి, ప్రజలను మోసం
చేసే ఒక పత్రికాసంపాదకుణ్ని సృష్టించి నువ్వు
చేసిన తప్పులన్నీ వాడిచేత పత్రికద్వారా సమర్థింప
జేసుకొన్నావు.

గా:- అవును, వాడే శతకోపం, 'బాకా' సంపాదకుడు.

సు:- నువ్విచ్చే కమీషనుడబ్బులకు లొంగి, శ్రమించకుండా
విలాసంగా, కులాసాగా డబ్బుఖర్చుపెట్టటం మరిగి
వేషాలుమార్చి, ఏదయినా కాగొడుగుపట్టి నీచాతి
నీచమైన పనులుజేసి మనుష్యులమన్న సంగతి మరిచి
పోయిన మట్టిబొమ్మలు....

షు:- వాళ్ళా సోమూ, రామూ—నా సేవకులు....

ష్లు:- నైటుక్లబ్బులకీ, నాజూకుతనానికీ, విలాసాలకీ లొంగి
స్త్రీత్వాన్ని మాతృత్వాన్ని విస్మరించి స్త్రీజాతికే
కళంక తెచ్చిపెట్టే కులట.....

గో:- శోభ! కులట కాదు. కళకి, కవిత్వానికి అంకితమైన
పూజారిణి, నా జీవితశోభ!

సు:- వీళ్ళంతా సంఘానికి చీడపురుగులు—కూకటివ్రేళ్ళతో
సంఘాన్ని కూలద్రోసే వేరుపురుగులు...

గా:- ఇంతేకాదు! ఇన్స్పెక్టర్! మరచిపోయావు. ఇంకొ డున్నాడు నమ్మించి మోసం చేసిన అప్పన్న...

సు:- పొరపాటు! అప్పన్నకు బాధ్యత నెరిగిన ప్రభుత్వపోలీసు ఉద్యోగి... అటు ప్రభుత్వానికీ ఇటు ప్రజలకీ సేవచేసే పరాయణుడు...ఇంక పద. నీ నాటకం ముగిసింది. న్యాయస్థానం నీకోసం ఎదురు చూస్తూవుంటుంది. నీ అనుయాయుల నందరినీ అక్కడ కలుసుకోందువు గాని...[ముందు గా... వెనుక సు...నిష్క్ర)మిస్తారు

[తెర]

మంగళమ్